శ్రీరస్తు.

కావ్యాలంకారసంగ్రహము

అను నామాంతరముగల

# నరసభూపాలీయము.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్‌సన్స్ వారిచే

ప్రకటితము.

1920




కావ్యాలంకార సంగ్రహ మను నామాంతరమున నలరు నీ నరసభూపాలీయ మనునలంకారగ్రంథమును దెలుఁగున రచియించినమూర్తికవి లక్షణకవులలో నొకఁడు. విద్యానాథుఁడు సంస్కృతమున వ్రాసినప్రతాపరుద్రీయ మనునలంకారశాస్త్రము నీతఁడు పద్యకావ్యముగా వ్రాసెను. విద్యానాథుఁడు కృతిపతినామధేయాంకితముగ లక్ష్యభాగమును వ్రాసినట్లే యీభట్టుమూర్తియుఁ గృతిపతి యగునరసభూపాలునిపేరట లక్ష్యభాగమును వ్రాసియున్నాఁడు. సంస్కృతమున విద్యానాథునికవిత్వ మెంతశ్లాఘాపాత్రమో ఆంధ్రమున నీతనికవిత్వము నంతశ్లాఘింపఁదగిన దని చెప్పుట కావంతయును సందియములేదు. వసుచరిత్రము లోనగుగ్రంథములు వ్రాసినరామరాజభూషణుఁడే యీమూర్తికవి యని కొందఱును, కాదని కొందఱును వాదింతురు. నిష్పక్షపాతబుద్ధితోఁ బరిశీలింప వీరిరువురకవిత్వ మేకరీతిగనే యున్నదని తోఁచెడిని. వీరిచరిత్రవిషయ మిచ్చట పెంచి వ్రాయఁబూనుకొనము. ఆవిషయమును నిర్ణయించు గ్రంథములు వేఱు. మాపని యదిగాదు. గ్రంథమును గూర్చిమాత్రము వ్రాయుపని మాదైయున్నది. ఇప్పనిని జేయఁబూని శాఖాచంక్రమణముగాఁ గవికాలము మొదలగు వానిని నిర్ణయింపఁబోవుట "నీవీబంధనవేళాయాం వస్త్రమూల్యపరీక్షణమ్" అను న్యాయము ననుసరించినట్లు యగును. కాఁబట్టి చరిత్రగ్రంథకర్తల కాభాగమును వదలితిమి.

ఇమ్మహాకవి కవిత్వ మసమానమై, యమృతముంబోలి కవిబుధజీవనాధారమై, హృదయంగమమై చెన్నారుచున్నది. నిఘంటువులఁ జెంత నునిచికొని యొక్కొక్కపదమునే యేర్చికూర్చినకవిత్వము వలెఁగాక యీతని కవితాధార దివిజగంగాప్రవాహముంబోలి యనివార్యవిజృంభణము గలదియై పెంపొందుచున్నది.

భారత భాగవత రామాయణాదులు చరిత్రముతో సంబంధించినగ్రంథములు, అట్టి గ్రంథములయందుఁ గవి పలుపోకలంబోవచ్చును. ఈగ్రంథ మట్టిదికాదు. అలంకారశాస్త్రము గావున స్వేచ్ఛగా స్వకపోలకల్పనలఁ జేయుట కవకాశ మీయదు. అట్లయ్యును గ్రంథమును రసవంతముగను, మృదుపదసంఘటితముగను జెప్పి తనకవితామహిమను జూపియున్నాఁడు. కవియే తనకవితామహిమను గూర్చి యిట్లు వ్రాసికొనియున్నాఁడు.

"స్వభావవేగంబును ఘనభూతిసుకుమారతయును మాధుర్యౌజస్యంబు నండినమతి

యలమయియాగుసునాకలన గాంభీరుసయర్థ, సంగ్రహమ్ము మృగారిశయ్య నేర్పు

సోముప్రసాదంబు సోమయాజులనియు, మంబు భాస్కరునిసన్మార్గఘటన
శ్రీవాఘనిపదప్రసిద్ధధారాశుద్ధి, యమరేశ్వరునిసహస్రముఖదృష్టి
తే. నీకకలదటుగాన ననేకపదన, సదనసంచారఖేదంబు నడలుపఱచి
భారతీదేవి నీజిహ్వఁ బాగుగానియె, మూర్తికవిచంద్ర విఖ్యాతకీర్తిసాంద్ర."

ఇది యతిశయోక్తి యని తలంపరాదు. చెప్పినట్లు చేయుట సామాన్యముగ నందఱకు నలవిగానిపనియే కాని యీతఁడట్లు చెయఁజాలినవాఁడని సులభముగఁ దోఁచును.

అప్పకవీయాది లక్షణగ్రంథము లొప్పని రేఫద్వయమైత్రి, యిత్వసంధులు మొదలగువానిని అచ్చటచ్చట నీకవి యుపయోగించి యున్నాఁడు.

## రేఫద్వయమైత్రికి.

"వేఱవివరింప నేల బంగారమునకుఁ, జటులసౌరభ్యలహరి యబ్బుటయకాదె."

"శా. శ్రీరంగప్రభుతిమ్మశౌరి భుజకాక్షేయంబుచేనాజుల
న్వీరారాతులఁ ద్రుంప నాక్షితిపతు ల్వేవేగ మార్తాండునిం
దూఱందూఱఁ దదీయమండలసముద్భూతవ్రణశ్రేణికి
న్నీరంధ్రప్రథచూర్ణభాతిఁ దగుఁ జెంతేఁ దచ్చమూరేణువుల్."

ఇంక నీకవి కవితాశక్తినిగుఱించి కొంచెము వ్రాసెదము. ఈమూర్తికవికి నతిశయోక్తి క్రమాలంకారాదులు మంచినిల్లప్రాయములు.

ఈక్రిందియుదాహరణము లీవిషయమును దేటపఱచును.

## క్రమాలంకారము.

"సీ. కమలాప్త కమలాప్త కమలాప్తసన్నిభుం, డెవిభుండు రుచి ప్రభావ దయల
గోరాజగోరాజగోరాజసంకాశుఁ, డేరాజు మతి భోగ గౌరవముల
హరిపుత్త్ర హరిపుత్త్ర హరిపుత్త్ర సదృశుఁడే, ధన్యుండు జయ రూప దానవిధుల
నాగారి నాగారి నాగారికల్పుఁ డే, మేటి ప్రాపీవ వేగ పాటవముల
తే. నతఁడుసువిచారుఁడవికారుఁడనఘుఁడలఘుఁ, డప్రమేయుఁడజయ్యుఁడతిప్రతాపుఁ
డప్రతీపుఁ డనేకలోకాభివంద్య, పరితుఁ డింపాండు వల్లభక్ష్మావరుండు."

## అతిశయోక్తి.

"ఉ. భూనుతశౌర్యుఁ డోబన్నృపపుంగవుఁ డుగ్రరణోర్వి భీమబా
హానిశితాసిధార నవతాహితకోటియుదస్త్రహస్తము

జటప్రోలు సంస్థానములోని యాస్థాన లగు పండితు బ్రహ్మశ్రీ వెల్లాల సదాశివ శాస్త్రులవా రిందలిమూఁడవయాశ్వాసమునకు బాగుగా విమర్శించి విశేషములు పెక్కు చేరిచి విపులముగా వ్యాఖ్యానము వ్రాసియున్నారు. అందచ్చటచ్చట లక్షణపద్యములలోని లోపములఁ గనిపట్టి సవరణలు చేసియున్నారు. ఆ సవరణ లిందు దిగువునఁ బొందుపఱుపఁబడి యున్నవి. వారి సవరణలను మే మిం దుపయోగించు కొన్నందులకు, ఆంధ్రభాషాప్రపంచమున కీవ్యాఖ్యానముచే శ్రీశాస్త్రులవారు గావించిన మహోపకారమునకును వారి కనేకవందనము లొనరించుచున్నారము.

మొదటికూర్పునందుఁ బ్రమాదవశంబునఁ బడిన తప్పులు దిద్ది యీకూర్పున నీగ్రంథరత్నమును నలంకరించితిమి. ఇందేమేఁ బొరపాటు లుండవచ్చును. వాని నిఁక మీఁద ముద్రించునపుడు సవరించుకొందు మని సజనమతులకు విన్నవించుచున్నాము.

నిందతు నందతు వా సన్నసూయు రనసూయు రత్ర కిం తేన,
యత్సన్మానసగమనాయై వేదం మమ తు పాథేయమ్.

చెన్నపురి.
13-5-13

ఇట్లు,
వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్.

శ్రీరస్తు.

# నరసభూపాలీయము

## కావ్యాలంకార సంగ్రహము.

---



### గ్రంథాదికృత్యములు.

లీలాపతి దా నురోమణిసభా సింహాసనత్కౌస్తుభా
వేలాభా ప్రతిబింబితాంగి యయిన న్వే ఱొక్కతం దాల్చినాఁ
డౌలే యంచుఁ దలంచునో యన యమం దానందుఁడై లక్ష్మి నే
వేళం గౌఁగిటఁ జేర్చుశౌరి నరసోర్వీనాథునిం బ్రోచుతన్. 1

సీ. ఏతేమ కదలిరాచూలి యనా చెటిఁగించుఁ, గలితవళీతరంగములరంగు
ఏమానినీరత్న మిందుసోదరి యనాఁ, బ్రకటించు మొగముపోలిక తెఱంగు
ఏతన్వి కందర్పమాత యనా చెటిఁగించుఁ, గరగృహీతాంభోజకాండకలన
ఏసాధ్వి దనుజారియిల్లా లవుటఁ దెల్పు, నలి వినీలాబ్జజిన్నయనగరిమ
తే. యట్టి శ్రీదేవి సుకవివాగమృతదంబు, నఖిలభువనోన్నతము నైనయాబలేంద్ర
నరసవిభుమందిరం బాత్మశరణమనుచు, నుండియేకాలమును బాయకుండుఁగాత. 2

చ. పలుకులకొమ్మ నెమ్మొగముఁ బార్వణచంద్రునిఁ గాఁ దలంచి యు
జ్జ్వలనిజభద్రపీఠజలజంబు నిమీలిత మౌనో యంచు నే
ర్పలవడ భారతీవనిత నాత్మముఖంబులలోనె తాల్పుచుం
జెలఁగువిధాత యోబయనృసింహున కిచ్చుఁ జిరాయురున్నతుల్. 3

సీ. ఒకటి యక్షరవిలాసోల్లాసమున మించ, నొకటి తాళప్రౌఢి నుల్లసిల్ల
నొక్కటి నారికేళోన్నతిఁ దాల్ప నొ, క్కటి గోస్తనీగుచ్ఛకలనఁ దనర
నొకటి సుప్తిభావోన్మేష మొంద నొ, క్కటి పల్లకీతుంబికలనఁ జెలఁగ
నొకటి భారవిశేషయుక్తిఁ బెంపొంద నొ, క్కటి గిరీశమతానుకారి గాఁగ
తే. వసుపసాహిత్యసంగీతరసము లనెడు, గుబ్బపాలిండ్లు దాల్చుపల్కులవెలంది
సరసగుణహారు నోబయనరసధీరు, నవ్యకృతినాయకునిఁ గా నొనర్చుఁగాత. 4

శా. గంగం దాల్చితి వుత్తమాంగమున నేఁ గైకోలు గావించి త
ద్రాంగీకారమునం బురంధ్రి నిను వామాంగంబునం దాల్పనే

శృంగారోన్నతిఁ జూడు మంచు గిరిజ స్విర్గాపగాబింబిత
స్వాంగానందితఁ జేయు శంభుఁడు నృసింహాధీశ్వరుం బ్రోవుతన్. 5

చ. అరుదుగ వామభాగలలనాకలనాచలనాత్ముఁ డైనయా
హరు గురుఁ గాంచి తానును దదాకృతి, నాగతి నేకదంతుఁ డై
కరికరిణీగుణంబులు మొగంబునఁ దాల్చి జగంబు లేలు నాం
తరకరుణాసనాథు గణనాథు మదుద్గణనాథుఁ గొల్చెదన్. 6

సీ. తనయాస్యగీర్వారంబునకు ఖద్యోతజృంభ, ణము ఖద్యోతజృంభణము గాఁగ
దనకరాంభోజాతమున కలగంధమా, దన మొకగంధమాదనము గాఁగఁ
దనశౌర్యహర్యక్షమునకు మైరావణ, స్ఫురణ మైరావణస్ఫురణ గాఁగఁ
దనవాలవచ్ఛోభి కెనయుకర్బురగో, త్రగరిమ కర్బురగోత్రగరిమ గాఁగ
తే. నలరు రామానుజన్మజీవప్రదాన, ధుర్యపర్యాయధాత మేదురవిరోధి
బలపయోధివిలంఘనప్రబలశక్తి, యొంబడు నృసింహభూభర్త కొసఁగుఁగాత. 7

సీ. ఎవ్వానిఁ గొ మొదలఁ దా నిలువ భారతి డించెఁ, దగ భగీరథుఁ డభ్రతటినిఁ బోలె తా
భ్రమరకీటన్యాయభాతి నేకవిరాజు, వాగ్దేవి దాన ద్యుమ్న వన్నె కెక్క
నర్వృత్తములు వాని వాణి యెవ్వానికై, నలచి నానాశ్లేషములకుఁ జిక్క
నెవ్వానివాజ్మాత్ర మినుని ధాత్రికిఁ దెచ్చె, పేర్మితోఁ గరము లర్పించుకొని యా
తే. నట్టి సుహిమాద్రిసులఁ గొల్చి యఖిలమునిస
భోనుపమశక్తిస్మృతపురాణార్థవితతు
లనుఁగుఁ దెనుఁగ నుభయ్యాదివ్యాంజనమునఁ
గనుఁగొనఁగఁ జేయు నంధ్రసత్కవులఁ దలఁచి. 8

సీ. ఏమహాత్ములు గల్గ భూమిశనసలలోఁ, గవులకు నధికవిఖ్యాతి గల్గె
నేకృతార్థులు గల్గ నెల్ల పాయసులకు, గణన మీరు ప్రబంధకములు గల్గె
నేవాజ్నిధులు గల్గ నిరవొందు రసికుల, కమితలీలావినోదములు గల్గె
నే ప్రవీణులు గల్గ నిల నలంకృతికృతో, ద్యములకు దోషలక్ష్యములు గల్గె
తే. నేదయాళులు బుధనచోహేతిచకిత, విసరదపశబ్దభరణలాలసముఖాబ్జు
లట్టి నిఖిలోపకారధీరాత్ములయిన, సకలకవిధుర్యవహులకు నంజలి యొనర్తు. 9

వ. ఇవ్విధంబునఁ బ్రారిప్సితగ్రంథనిర్విఘ్న పరిసమాప్తిసంప్రదాయావిచ్ఛేదలక్షణ నిబంధనంబు గా నిఖిలాభీష్టదేవతానమస్కరణంబును, సుకవిబహూకరణంబును, కుకవినిరాకరణంబును, గావించి, యుదంచితవిరంచిసంచితప్రపంచచరదభంగ బుధపుంగవ హృదయంగమంబును, గంభీరరససముజ్జృంభితకవితాంభోధితరణ కరణప్రగుణోపకరణపరిణతతరణిప్రకాండంబు, నశేషగుణదోషవిశేషనుర్వార విర

క్షీరవివేచనోచిత ప్రశంసితహంసాయమాన ప్రతిమానబంధంబు నగుశ్లోకప్ర
బంధంబు నివర్తింపఁ బూనియున్న సమయంబున.

సీ. లలితాకలంక కలాకలాపంబున, నే రాజు రేరాజు నేవగించి
భూభారధరణలీలాభిముఖ్యంబున, నేమేటి తామేటి నెగ్గులాడుఁ
జతురభాషామనీషావిశేషావాప్తి, నే భోగి యాభోగి నిసడించు
శరణాగతగణాతిభరణాధికగుణాప్తి, నే శౌరి యా శౌరి నేపు మాపు

తే. నతఁడు రిపురాడఖర్వగర్వాంధకార, గంధనిర్గంధనాంగభోజబంధుబంధు
బంధురాచార్యశౌర్యధురంధరుండు, సరసగుణహారుఁ డోబయనరసఘనుఁడు. ౧౧

వ. వెండియుం బ్రచండభుజాదండతాండవమండలాగ్ర ఖండితారాతిమండలుండును
నఖండ నవఖండపృథ్వీమండలధురాభరణపరాభూత ఖండపరశుకుండలుండును
నజాండకరండ పిచండిలయశఃపూరకర్పూరహారుండును సరస్వతీమనోహరాకార
శౌర్యాకారుండును సమరసమయసముజ్జృంభితజంభారివోస్త్రసంధ సముత్తంభిత
దంభోళి ధారావిదారితమహాభీలశైలాళివిశాలరవకోలాహల లీలాహాకహాకా
సమారంభ సుభగంభావుకగంభీర విజయభేరీ భయంకరభాంకారసంకరసముట్టంకిత
దిగ్విటంకుండును నత్యుద్రతరసురక్షోభకరమదోన్మత్తరక్షోన్నతరక్షోవక్షో
క్షోదవిచక్షణాతీక్ష్ణనృహర్యక్షరూక్షవీక్షణీభవదాశుశుక్షణిక్షణసముత్క్షిప్త కీలా
కరాళావిచ్ఛిన్నాచ్ఛచ్ఛాయాచ్ఛటాపటిమఘటనచటుల ప్రతాపవైభవుండును
నుభయరగండగండభేరుండాదిబిరుదామందసందీపిత ప్రాభవుండును సహోధారణా
మేధావిదారిత వేధోమేధోపబోధనిర్నిరోధమధురమధురసావష్టంభణ సమగ్ర
వాగ్గ్రథపథన సుధీజనగృహద్వార నిర్నిద్రభద్రవారణఘటావికటకటకటా
హతటపతదనూనదానాంభోఝురీపరిమళ పరిలబ్ధలుబ్ధలబ్ధామోదమధుర ధ్వాంత
తరంగితభంగీ ప్రసంగత ప్రసంగాంగీకృత నిరంతర దిగంతర విశ్రాంత విశ్రా
ణనజయావకుండును గుళికసుతకులజలధిజైవాతృకుండును నానావిధభానాధిక
సేనాంబునిధానా నుపమానాపమానామితావోఘవైఖరీ పరిపంథిబరిదసపాక
సప్తాంగహారుండును భోజరాజవంశసంభవుండును లక్కాంబాగర్భపావనుండును ప
రమభాగవతసంభావనుండును నోబభూపాలపుత్త్రవరుండును గడియారస్థాపనా
చార్యుండును సత్యభాషాహరిశ్చంద్రుండును నగునృసింహక్షితీంద్రుం డేకాగ్ర
నాఁడు రుచిరరుచిరుచిరతావిశేషదూషితోషర్బుధులు బుధులు సరస్వతీప్రవాహ
సంతతవిహారమాణమహాకవులు కవు లజిహ్మాజిహ్వాగ్రనృత్యత్తుంగగైర్వాణ
వాణీప్రాకృతశౌరసేన్యపభ్రంశపైశాచికామాగధులు మాగధులు నటనజితమహా
నటులు నటులు వరయౌవనసౌందర్యవసతులు సతులు నయవినయసౌజన్యులు రాజన్యు
లవధీరిత సురరాజమంత్రులు మంత్రులు ప్రబలబలోద్భటులు భటులు పురోహి

# కావ్యాలంకారసంగ్రహము.

## నాయకవంశవర్ణనము.

సీ. శ్రీమించు పద్మినీభామామణికి నెందు, నిరతసంసారవారిధికిఁ దరణి
త్రిజగతీసజ్జనశ్రేణికి మిత్రుండు, బహుతమోవనికి విభావసుండు
సమదమందేహదేహములకుఁ దపనుండు, చతురాగమార్గసంతతికి సవిత
సకలఘోరపరంపరకు సహస్రకరుండు, వినతలోకవితానమునకు ద్యుమణి
తే. హరిహరవిరించిముఖదేవతానుభావ, ఘనపరస్వర్ణకారు లొక్కటియ కాఁగఁ
గిరఁగికార్చినయపరంజికడ్డి యనఁగ, సూర్యుఁడిరవొందుఁదేజోనివార్యుఁడగుచు.

క. ఆతనికి వైవస్వతమను, వనికి నిక్ష్వాకునృపతి యతనికిఁ గుక్షి
క్షితిపతి యతనికి వికుక్షిం, బ్రతాపఘనుఁ గనియె నతఁడు బాణునిఁగనియెన్. 30

సీ. అనరణ్యునతనికి నాయనఘుండు పృథుఁ గాంచెఁ, బృథుఁడు త్రిశంకుధాత్రీంద్రుఁ గనియె
నతనికి దుంధుమారాఖ్యుఁ డతనికి, మాంధాత యతఁడు సుసంధిఁ గాంచె
నతనికి ధ్రువసంధి యతనికి భరతుఁ డా, ధన్యున కసితుఁ డాతనికి సగరుఁ
డతనికి నసమంజుఁ డతఁ డంశుమంతునిఁ, గనియె దిలీపుఁ డాతనిసుపుత్త్రుఁ
తే. డతఁడు గాంచె భగీరథు నాత్మవంశ, పావనుని నాతనికిఁ గకుత్స్థనఘుఁ
డతఁడు రఘుఁ గాంచెఁ గనియె నాక్షితితలైక, పతిని నాభాగు నతఁడు నాభాగుఁ గాంచె.

చ. ఆతనికి నంబరీషుఁ డయుతాయువు తత్సుతుఁ డవ్వసుంధరా
పతి గనియె న్మహాత్ము ఋతుపర్ణు నతండును సత్యకాము నా
తత బలుఁ గాంచె నాతఁడు సుదాసునిఁ గాంచెఁ దదీయుఁ డస్త్రిసం
డతనికి మూలకుం డతని కాత్తసంఖ్యురఘుండు వెండియున్. 32

క. ఘనుఁ డతఁ డైలబిలేంద్రునిఁ, గనియెం బృథుధర్మవిభునిఁ గనియె నతఁ డతం
డను విశ్వమహునిఁ గనియెం, గనియె న్ఖట్వాంగు నతఁడు గాంభీర్యనిధిన్. 33

సీ. భవ్యుఁ డాతఁడు దీర్ఘబాహునిఁ గనియె నా, తఁడు గాంచె రఘువు నాతనికిఁ గలిగెఁ
బాగొప్పాదుఁ డతనికిఁ బొడమెఁ గల్మాషపా, దుఁడు తత్సుతుఁడు శంఖనుఁడు సుదర్శ
నుఁడు దత్తనూజుఁ డాతఁడు గాంచె నగ్నివర్ణమహీశు నతఁడు శీఘ్రగునిఁ బడసె
నతనికి మరుఁడు దదాత్మజుఁడు శుశ్రుతుఁ డా, తని కంబరీషుఁ డాతనికి నహుషుఁ
తే. డతనికి యయాతి నాభాగుఁ డతని కతని, కజుఁడు దశరథుఁ డతనికి నతనికొదవె
రామభద్రుఁడు దద్వంశరత్నమయ్యె, సారిది గలివేళఁ గలికాలసోమవిభుఁడు. 34

సీ. ఏరాజు వివిధపుష్పారామమున గంగ, గాధిసుతులమీఁది కాచు మానె
నేరాజు దివ్యాన్నసారోర్పణంబున, శితికంఠు మొదలున్న చేదు మాసె

తే. నాజి మాంధాత యనఁ బొల్చు రసికలోక, సతతసంరక్షణాస్తోకజాగరూక
నవనవానందహృల్లగ్న నందగోప, బాలకుం డైనతిప్పభూపాలకుండు.

తే. అతఁడు రామప్రభుని బానెమాంబయందు, నాబళేంద్రు నిలకాంబయందుఁ గనియె
జలజనయనుండు రుక్మిణీజాంబవతుల, యందుఁ బ్రద్యుమ్న సాంబుల నందినట్లు.

క. వారలలోన ధురంధరుఁ, డై రామనృపాలుఁ డమరు నమరపురంధ్రీ
చాటుకరగ్రహలీలా, కారణఘోరగ్రహకుటిలకాంక్షేయకుఁ డై. 45

చ. హరిభజనప్రవీణుఁ డగు నాధరణీంద్రుఁడు బైచమాంబికం
బరిణయమై తనూభవులఁ బ్రాజ్ఞులఁ దిమ్మనృపాలు నోబభూ
వరు నరదేంద్రుఁ దిప్పమహిపాలుఁ బానెమరాజు వేంకటే
శ్వరు నిలఁ జక్రవర్తి సదృశప్రథితాత్ములఁ గాంచె నార్యరన్. 46

చ. అరయఁగ నమ్మహీపతుల కగ్రజుఁ డై తగు తిమ్మరాజు ని
ర్భరతరధాటికాతురగపాటనమూర్ఛిత యౌ ధరాతలో
దరికి నిరామయత్వవిధానము నిర్జరవైద్యు వేఁడఁగా
నరిగెడులీల నద్భుతసహస్రరజోవ్రజ మేఁగు నింగికిన్. 47

క. ధర నతఁడు రామనృపసో, దరి యగు కొండాంబయందుఁ దనయునిఁ గాంచెన్
నరనుతు నెర వేంకటవిభు, హరిసిరియం దతనుఁ గన్నయాకృతి దోఁపన్. 48

సీ. మిత్రగేహములనమిత్రగేహమ్ములఁ, గనకసంభూత మేఘుఁడు నిల్పె
ధర్మాగమమున సద్ఘర్మాగమమున ని,ర్భరగుణారోప మేరా జొనర్చె
విగ్రహంబున భీమవిగ్రహంబున మహా,విషమాంబకత్వ మేవిభుఁడు దాల్చెఁ
గృతులయందు నిఖిలాకృతులయందును రాగ, భరితవీక్షణ మేనృపాలుఁ డునిచె.
తే. జగతి నేరాజు కువలయోత్సవ మొనర్చె, రాజు గావున నటు స్వీయరక్షచేతఁ
గోరి యన్వర్థ మగుచంద్రగుప్తిదుర్గ, మతఁడు విలసిల్లు వేంకటక్షితివరుండు. 49

తే. అతఁడు తిమ్మాంబయందుఁ దిమ్మావనీశుఁ, జిన్నతిమ్మప్రభునిఁ గాంచె సీతయందు
రవికులోద్ధారకుం డైనరాఘవుండు, గరిమఁ గుశలవవీరులఁ గన్నకరణి. 50

క. ఈసంతతిఁ దగు తిమ్మ, క్ష్మాసుత్రామునకుఁ గూర్మి సహజన్ముఁ డనన్
భాసిల్లు నోబనృపతి శు, నాసీరమహీజవితరణగుణాస్పదుఁ డై. 51

చ. సరసనఖప్రసూనభుజశాఖలఁ జెంది వచోమరందమా
ధురిఁ జెలు వొంది కీర్తి యనుతోరపువాసనఁ బొంది సొంపునం
బరఁగుదళంబులం బ్రబలి పండితకీరపరంపరాఫల
స్ఫురణ మొసంగు నోబనృపపుంగవుఁ డాశ్రితపారిజాత మై. 52

ఉ. భూనుతశౌర్యుఁ డోబనృపపుంగవుఁ డుగ్రరణోర్వి భీమబా
హానిశితాసిధార నసతాహితకోటి సముద్ధతహస్తము
ల్పాని హరింపఁ దద్గళితభూరిసమున్నతఖడ్గము ల్పర
స్థానము చేసిన ట్లమరు సారెను వారికి నూర్ధ్వయాత్రకున్. 53

క. అతఁ డోబళాంబయం ద, ప్రతిముని నోబళనృపాలు రామమహీశున్
క్షితిఁ గాంచె విద్యయం ద,ద్ధుతధీనిధి వినయబోధములఁగాంచుగతిన్. 54

క. తదనుజుఁడు వరదభూపతి, సుదతీమకరాంకుఁ డమరు సురపురవనితా
విదితవరదానచాతురి, గదిసినయాత్మీయనామకము సార్థముగన్. 55

వ. తత్క్రమంబున. 56

సీ. అవనినభోంతరం బాస్యరంధ్రము గాఁగ, ఘనపంక్తి మోముపైకప్పు గాఁగ
హిమశైలవింధ్యశైలములు కొమ్ములు గాఁగఁ, బూర్ణచంద్రుండు మూఁపురము గాఁగ
శరధులు నాలుగు గొరిజపట్టులు గాఁగ, నైలింప నది గంగడోలు గాఁగ
వాసుకి యాభీలవాలదండము గాఁగఁ, దారకల్ కింకిణీతతులు గాఁగ

తే. గరిమఁ జెన్నొందు బసవశంకరమహాంక, మాజి నేరాజశేఖరుం డావహించె
నతఁడు నిలువెల్లమగఁటిమి యనఁగఁ బరఁగు, రామవిభుతిప్పశౌరి నిర్వారితారి. 57

సీ. బలధూతధూళిచేఁ బందిళ్లు సమకట్టి, యహితరక్తము కలయంపి చల్లి
నవయశోరుచివితానవితానములు గట్టి, వివిధవాద్యధ్వను ల్వేలయఁ జేసి
విమతాస్థిపటలచూర్ణముల ముగ్గులు పెట్టి, ద్విజపరంపరలకు విం దొనర్చి
దళితారికుంభిముక్తాఫలంబులనేస, చల్లి ప్రతాపాగ్ని సాక్షి గాఁగ

తే. మెఱయు నేరాజు విజయలక్ష్మీవివాహ, విదితసన్నాహుఁడై యతఁడదురుగుండె
పిటికికండరయు లేనిగభీరఘోర, రణజయోత్సాహి పానెమరామవిభుఁడు. 58

చ. అతనిసహోదరుండు చతురంబుధివేష్టితభూధురంధరుం
డతులితశౌర్యభీకరభుజాగ్రుఁడు వేంకటరాజు వొల్చు నా
క్షితిపతి దానవాసనల ఖేచరశాఖిఁ దిరస్కరింపఁగా
వితతతదీయదుర్యశము విస్ఫుట మా నలిమండలాకృతిన్. 59

క. ఈవంశకర్త యగుతి, ప్పానిపాలునకుఁ గూర్మి యనుజన్ముఁడు దా
నై వెలయు న్వల్లభధా,త్రీవల్లభుఁ డఖిలరాజతేజోనిధియై. 60

సీ. కమలాప్తకమలాప్తకమలాప్తసన్నిభుం, డేవిభుండు రుచి ప్రభావ దయల
గోరాజగోరాజగోరాజసంకాశుఁ, డేరాజు మతి భోగ గౌరవముల
హరిపుత్త్ర హరిపుత్త్ర హరిపుత్త్ర సదృశుఁడే,ధన్యుండు జయరూప దానవిధుల
నాగారి నాగారి నాగారికల్పుఁ డే, మేటి ప్రాభవ వేగ పాటవముల

తే. నతఁడు సువిచారుఁ డవికారుఁ డనఘుఁ డలఘుఁ, డప్రమేయుఁ డజయ్యుఁ డతిప్రతాపు
డప్రతీపుఁ డనేకలోకాభివంద్య, చరితుఁ డింపొందు వల్లభక్ష్మావరుండు. 61

ఉ. వల్లభరాజశౌర్యగుణవైభవ మెన్న విచిత్ర మమ్మహీ
వల్లభువైరిరాజి వనవాటికనుండి నిజాంబుజాస్యత
న్వల్లభ యందుఁ బిల్వఁగ నవార్యతదుజ్జ్వలనామసంస్మృతిం
బెల్లు వడంకుఁ గాంతపయిప్రేమము గొంతనెపంబు సేయుచున్. 62

క. అతులప్రతాపుఁ డా భూపతి ప్రోల్దేవేరియందుఁ బ్రబలునిఁ దిమ్మ
క్షితిపాలునిఁ గాంచెఁ బశుపతి పార్వతియందు గుహునిఁ బడసినభంగిన్. 63

సీ. భోగి మట్టినవానిఁ భోగి జుట్టినవాని, భోగిఁ బట్టినవానిఁ బోలనేర్చుఁ
దమ్మిఁ దాల్చినవానిఁ తమ్మి దొల్చినవానిఁ, దమ్మి మొల్చినవానిఁ దారసించు
మృగము నుంచినవాని మృగముఁ ద్రుంచినవాని, మృగముఁ బొంచినవాని మీఱజాలుఁ
గొండ నొక్కినవానిఁ గొండఁ జెక్కినవానిఁ, గొండఁ ద్రొక్కినవానిఁ గొదవసేయు
తే. భరణభూతిజవప్రభాబాహుశక్తి, మతికళాశౌర్యసత్యశుంభత్ప్రభావ
భోగగాంభీర్యగుణములఁ బుడమి నెన్న, పాలకులు సాటి యాతిమ్మపార్థివునకు. 64

తే. అతఁడు గంగాంబయం దౌబళావనీంద్రు, మూర్తిఘను సింగవిభుఁ గాంచెఁ గీర్తినిధుల
నత్రి యనసూయయందుఁ మున్నబ్జగర్భ, కమలనాభకపర్దులఁ గన్నయట్లు. 65

ఉ. వారలలో గభీరగుణవారిధి వారిధిపంక్తిలో సుధా
వారిధి వోలె భూమిధనవర్గములోఁ గనకాద్రి వోలె దో
స్సారము ధీరముం దెగువ సత్యము శౌచము సద్విచార మా
చారము గల్గి పొల్చె బుధసన్నుతుఁ డౌబళరాజు ధన్యుఁడై. 66

సీ. అప్పుపాలైనశుభ్రాబ్జంబు రుచి యెంత, మాటమోచినయంచతేట యెంత
నీళ్లు మోచినభవానీభర్తకలి మెంత, బిలము దూఱినశేషుబలిమి యెంత
తమ్ములతోఁ బోరుతారేశుకళ యెంత, తృణమైనశరపుంజదీప్తి యెంత
పండ్లిగిలించుకల్పకశాఖిదళ మెంత, విరిసినమల్లెలవీఁక యెంత
తే. యనుచుఁ దనకీర్తి ధవళాబ్జహంసమదన, మథనవరభోగివిధుశరామర్త్యవిటపి
వికచవిచికిలమాలికావితతిఁ దెగడ, వసుధఁ బాలించు నోబభూవల్లభుండు. 67

సీ. ఇతనివైరులు వనప్రతతిలోఁ గాఁపుండ, నన్వర్థమై ధాత్రి యవని యయ్యె
నితఁ డంతరీపంబు లేల ముద్రాసమున్నిద్రుఁడై జలధి సముద్రుఁ డయ్యె
నితనియాలము చూచి యెల్లవేల్పులు నిమేషము మాన ననిమేషసంజ్ఞఁ గనిరి
యితనిసేనాధూళి హిమసేతువులు గప్ప, గౌరీశుఁ డపు డంధకారి యయ్యె

తే. నితనికరుణాంబురాశిసంభృతతరంగ, సంగతం బైనమనమున సంచరించి
శౌరి నారాయణుం డయ్యె జగతి ననుచు, సుకవులు నుతింతు రౌబళక్షోణివిభుని 69

వ. తత్క్రమంబున.

సీ. చతురాననాధిక శ్రుతిహితశీలుఁ డై, విబుధాన్నదానప్రవీణుఁ డగుచు
వసుమతీభారధూర్వహుఁ డై నృసింహ తా,భ్రాజి యై బలిశిరోరత్న మగుచు
నర్జునకరగర్వవారణసత్కీర్తి యై, యతనుశాస్త్రపధర్మహారి యగుచుఁ
గామపాలాఖ్యుఁ డై గరిమసర్వజ్ఞుఁ డై, నరవరోచిత మైనపడత యెఱిఁగి
తే. శౌరి బహురూపవిహరణశ్రమముఁ జెంద, లేక యన్నిగుణంబులు నేకమూర్తి
యందు నిరవొందఁ జేసినయట్లు వొల్చు, మూర్తినిర్జితరతిరాజు మూర్తిరాజు. 70

చ. చిరతరకీర్తి మూర్తినృపశేఖరుఁ డాహవదుర్మదారిభూ
వరులఁ గరాగ్రలోలకరవాలముఖమ్మున గ్రుచ్చి యెత్తుఁ ద
ద్వరవరణాభిలాషయుతవాసవలోకవిలాసినీపరం
పరలకు వీరు వల్లభులు పట్టుఁ డటంచు నొసంగు కైవడిన్. 71

సీ. గుఱుచనిపకుల కాటరి మొప్పఁ గొంచలి, యొసఁగియుఁ గొంచని యొసఁగ కుండు
నమితలావణ్యలీలావాప్తి వే మాఱుఁ, గినిసియు వేమాఱుఁ గినియ కుండు
సత్కీర్తిచే సుధాకరదేవసరసుల, నాడియు సరసుల నాడ కుండు
నరులపై నిశితసాయకపంక్తి చేపట్టి, విడిచియుఁ జేపట్టి విడువ కుండు
తే. ఫణిపతికి నైన భారతీపతికి నైనఁ, బశుపతికి నైన నలబృహస్పతికి నైన
నవని నవలీలఁ బొగడంగ నలవిగాని, చరితములఁ బొల్చు నాసింగజనవిభుండు. 72

చ. చకచకమించుసింగనృపచంద్రనిశాతకృపాణవల్లిలోఁ
బ్రకటవిరోధియూధరథభద్రగజాశ్వవరూథినీకదం
బకములు గాన వచ్చు సులభప్రతిబింబితమూర్తు లై మహా
జికలితసాధ్వసోదయము చే ననిగర్భముఁ జొచ్చెనో యనన్. 73

తే. ఇట్లుసుగుణాభిరాము లై యొనయమూర్తి,ఘనుఁడు సింగక్షితీంద్రుఁడుఁ దను భజింప
నెలమి భీమార్జునులుగొల్వ నింపుమీఱు,ధర్మసుతుమాడ్కిఁ దగు నోబధరణివిభుఁడు.

సీ. ఘనభుజాశౌర్యరాఘవుఁడు రాఘవదేవ,ధరణీశుఁ డేరాజు తాతతాత
నరనుతుఁ డైనపిన్నమరాజు సౌజన్య,ధన్యుఁ డేరాజుముత్తాతతండ్రి
యమితవైభవుఁ డైనయార్వీటిబుక్కభూ,తలనాథుఁ డేరాజుతండ్రితండ్రి
యసమానదానవిద్యాధురంధరుఁ డగు,రామరాజేంద్రుఁ డేరాజుతండ్రి

తే. యట్టిసోమాన్వయాబ్ధిశీతాంశుఁ డనఁగ, నమరు శ్రీరంగవిభుపుత్త్రులై చెలంగు
లక్కమాంబను వరియించె లలితశీల, నమ్మహాసాధ్వి సోదరు లధికయశులు. 75

క. కోనక్షితిపతితిమ్మను, హీనాఘుఁడు రామనృపతి యెఱతిమ్మధరా
జానియును వేంకటేంద్రుఁడు, భూనాయకతిలకు లగుచుఁ బొల్తురు ఘనులై. 76

77
వ. అందగ్రజుండు.

సీ. లాటీకుచాభోగపాటీరపంకంబు, బోటీముఖాబ్జకర్పూరకలన
గౌళీనవీనాంకపాళీసుకుంకుమంబు, చోళీకుచాళీప్రసూనరాజి
యాంగీముఖాంకగసంగీతవాణికా, భృంగీవిలాసకేళీమరాళి
భోజీకరస్నేహరాజీసకాంతికాంత, భోజీమహాహీరముకురరేఖ
తే. కుంతలీకర్ణమౌక్తికకుండలమ్ము, కాదె యెవ్వానియభినవాకాశదేశ
చంద్రకాంతసత్కీర్తిజాల మతఁడు, ప్రబలు శ్రీరంగవిభుకోనపార్థివుండు. 78

79
వ. తదనుజుండు.

శా. శ్రీరంగప్రభుతిమ్మశౌరిభుజకాండేయంబుచే నాజుల
న్వైరారాతులఁ ద్రుంప నాక్షితిపతుల్ వేగ మార్తాండునిం
దూఱందూఱఁ దదీయమండలసముద్భూతవ్రణశ్రేణికి
న్నీరంధ్రౌషధచూర్ణభాతిఁ దగు నెంతేఁ దచ్ఛమూరేణువుల్. 80

81
వ. తత్క్రమంబున.

సీ. ఖలు నతిద్రోహి సల్కయతిమ్మని హరించి, సకలకర్ణాటదేశంబు నిలిపె
నతుని వర్ధితునిఁ దత్సుతునిఁ బట్టముఁ గట్టి, సుతుపనముల్కన క్షోణి నిలిపెఁ
బదిలుఁడై రాచూరుముదిగల్లుగప్పంబు, సేయఁ గాంచి సపాదసీమ నిలిపె
శరణన్నమల్కనిజాముని కభయం బొసంగి తదీయరాజ్యంబు నిలిపె
తే. నవని యంతయు రామరాజ్యంబు సేసెఁ
దనగుణంబులు కవికల్పితములు గాఁగ
నలవియె రచింప సత్కావ్యములను వెలయ
భూమి నొకరాజమాత్రుఁడే రామవిభుఁడు. 82

సీ. ఖరదూషణాఖర్వగర్వనిర్వాపణం, బాజి నెవ్వానిసాయకనికాయ
మధికతారావరాహంకారవారణో, ద్వేల మెవ్వనియశోవిమలశోభ
విపిధారికామినీవిఘటనాటోప మే, యవనీశకోపారుణాక్షిరేఖ
పౌలస్త్యనిరసనప్రౌఢిమాంకాకితం, బేరాజుచారిత్రచారుభూతి

తే. యతఁడు కలియుగనవ్యరామావతార, చారుతాసార్థనామప్రచారుఁ డగుచు
వెలయు బ్రహ్మాండపేటికావితతకీర్తి, ధనుఁడు శ్రీరంగవిభురామధరణిధవుఁడు. 83

సీ. తనభుజాదండకోదండ మఖండమై, యనువేలశరవృష్టి నాచరింపఁ
దనహేతిశతకోటిఘనధాళధళ్యమై, ప్రతిపక్షబలభిదాపటిమఁ నెఱప
దననిగ్రహంబు సజ్జనమనోహారియై మంజుఘోషాశ్లేషమహిమఁ జెలఁగఁ
దనవైభవంబు సంతానసమగ్రమై, సురభిసంభృతగుణస్ఫురణఁ జెంద
తే. రాజదేవేంద్రుఁ డితఁ డనఁ దేజరిల్లు, ననఘుచాళుక్యనారాయణాంకవివిధ
బిరుదమన్నెవిభాళాదిబిరుదశాలి, ప్రాభవోపేంద్రుఁ డెఱ్ఱమ్మపార్థివుండు.

సీ. అసురారిరాణి నే నధివసించుట యెట్లు, బహువిధాసురవంశభవులయందు
సురలోకధేనుసోదరి నేను నిలుగుటెట్లు, కటకట గోఘాతపాతకులయందుఁ
ద్రైలోక్యమాత నేఁ దగిలి యుండుట యెట్లు, త్రైలోక్యకంటకోద్ధతులయందు
దేవతారాధ్య నే దిరముగాఁ దగు టెట్లు, కడుదేవతాద్రోహకరులయందు
తే. ననుచు యవనులఁ జెగడి తన్నాశ్రయించు, వారిసామ్రాజ్యలక్ష్మి సేవ్యుఁడుగ నియు
నాహవోగ్రబరీదసప్తాంగహరణుఁ, డితఁడు విలసిల్లు శ్రీవేంకటాద్రివిభుఁడు. 85

మ. ప్రతికూలాదనుభృద్విభేదనకళాపారీణమై సంగర
క్షితిలో వేంకటరాజశేఖరునికాంక్షేయంబు కృపాణిక
ద్యుతిఁ జెన్నొందఁ దదీయధారఁ బడి కాదో పాకిరు ల్యావన
క్షితిపు ల్గాంచిరి నాకలోకవనితాశృంగారసాంగత్యముల్. 86

మ. బలధుర్యుం డగు వేంకటేంద్రునిమహాబాహాబలాటోప వి
హ్వలుఁడై మున్నతిధావనక్రియ సపాదాఖ్యుఁ డైనట్టియే
దులఖానుం డిదె నేఁడుఁ గ్రమ్మఱ సపాదుం డయ్యె నా నర్మిలిం
దలఁ దత్పాదము దాల్చె భీమరథిపాంతం గాన నిత్యోన్నతిన్. 87

మ. స్థిరసంగ్రామజయాభిరాముఁ డగునా వేంకటక్ష్మావరుం
డరయ న్రాజశిఖావతంసుఁ డగుఁ దధ్యం బుర్విఁ గాఁ గన్న నీ
ధరణీపాలకు లెల్ల మెచ్చఁగ సపాదక్షోణిభృత్ప్రాప్తి భా
సురపుర్గాధిపతిత్వవైభవభవస్ఫూర్తి న్విజృంభించునే. 88

క. ఈరాజమణులసోదరి, యై రాజిలు లక్కమాంబ యమృతాశనధా
త్రీరుహములకై దింటికి, నారయఁ దోఁబుట్టు నగుచు మాంగనపగిదిన్. 89

సీ. ప్రతివచ్చు నన్నపూర్ణాదేవి ఘనకీర్తి, మిహిక సంయమి నలయింప కున్నఁ
బాటి సేయఁగ నచ్చు భాగీరథి నదంబు, ముట్టి పెక్కువాఁగయై మునయ కున్న

సరి వచ్చు భూకాంత సకలప్రజాభార, పూర్ణాసహత్వంబుఁ బూన కున్న
రూపింపవచ్చు వసుంధతి నేప్రొద్దుఁ, దనయల్పభావంబు దాల్ప కున్న
తే. నిమ్మహాసాధ్వి కని జను లెల్లఁ బొగడ, నలరు నోబక్షితీశు నర్ధాంగలక్ష్మి
బాంధవావనధుర్యవైభవకదంబ, లలితసద్గుణనికురుంబ లక్కమాంబ.

క. పౌలోమికి నింద్రునకు మ, హాలలితాకృతి జయంతుఁ డాత్మజుఁ డైన
ట్లాలక్కమాంబ కోబన్న, పాలునకు నృసింహధరణిపతి జనియించెన్. 91

సీ. కాశ్యపి తా నాఁటఁ గశ్యపోద్భవుఁ డైన, కాకోదరస్వామిఁ గలయు టెట్లు
ధాత్రి యా తనపయోధారచేఁ బెరిగినఁ, గమఠకులాధీశుఁ గవయు టెట్లు
తగ శేషు నగువేయి దర్భకం బగుధరా, ధరశిరోమణిఁ గూడఁ దలఁచు టెట్లు
తనక యావిర్భవించినపంచనామహా, క్రోడంబుతోఁ గూడి యాడు టెట్లు
తే. వగవు గాదంచు ఫణికూర్మధరణిధరవ, రాహభూదారముల మాని యవనికాంత
తనభుజాదండమున నుండఁ దనరుచుండు, సంససణహారి యోబయనరసశౌరి. 92

క. ఆతఁ డిల రామయాత్మ, క్షితిపతిసత్పుత్త్రుఁ డగుదుర్గ జెలు వొందుగుణా
న్వితుఁ డగుతిరుమలధాత్రీ, పతితనయం దిరుమలాంబఁ బరిణయ మయ్యెన్. 93

సీ. పాలు పగు నేసాధ్వి భుజవల్లి యక్కిణీ, సత్య యేగరితవాచావిశుద్ధి
జనకనందిని యేవిశాలాక్షిమతిరేఖ, భద్ర యేమగువ శోభనవినీతి
యనసూయ యేకుటుంబిని దృష్టి సర్వమం, గళ యేశుభాంగ నలలితరీతి
స్మృతి సుదక్షిణ యేసతివ్రతకరుణసం, పత్కాంత యేయింతి భవ్యమూర్తి
తే. యట్టిగుణధన్యయై తనయాత్మ యెల్ల, సకలపతిదేవతాసంగ్రహం బనంగ
నలరు నరవీరపల్లి తిమ్మానినింద్ర, శరధిమందారపల్లియై తిరుమలాంబ. 94

తే. ఆమగువయందు నరసింహభూమివిభుఁడు, దేసిక సారంగరాజు శ్రీరంగరాజుఁ
గనియె నసఘునిదేవకీకాంత యుంను, ఘనుఁడు వసుదేవుఁ డచ్యుతుఁ గన్నపగిది. 95

క. అతఁ డుభయవంశపావనుఁ, డితఁ డన బాలార్కవిజయహేవాకవిభా
సితతేజుఁ సముంపముద, స్మితసంవ్రాతపము దాల్చ శ్రీరంజితుఁ డై. 96

సీ. ఘనతఁ బసాఁపనేర్చిన నాఁటనుండియు, శత్రులమీఁదఁ జేఁ జాఁప నేర్చె
వసుయంబు నగుగు వెట్టిన నాఁటనుండియు, వరివెంబులమీఁద నడుగు పెట్టె
నవసరము గ్రహించు నాఁటనుండియు వైరి, కలయశోవసనిధుముల గ్రసించె
నవపాంసుగతిఁ జెందు నాఁటనుండియు ఖిలా, ఖిలధాటీపాంసుకేళిఁ జెందె
తే. నిలువ నేర్చిననాఁటనుండియు విరోధి, నృపతిసేనాపతుల గెల్చి నిలువనేర్చె
నగసవిభునిసిరంగభూనాథవిభుఁడు, ప్రబలెఁ బ్రబలుఁడును న్యాయుఁడు ప్రబలగలఁడు.

వ. ఈకుమారనారాయణుం గాంచిన రాజన్యపుంగవునకు. 98

క. ఏతాదృశగుణమణికి న్భూతలపరిపూర్ణకీర్తిరమణికి జలధి
వ్రాతావృతధరణీభరణా, మాతతనిజభుజభుజంగమగ్రామణికిన్. 99

క. ధన్యునకుం దరణికులమూ, ర్ధన్యునకు నిజప్రధానిరత్నవదాన్యం
మన్యునకరాతినృపపర్జన్యనిబంధనవిశేషశతమన్యునకున్. 100

క. అజరగజరజతరజనీకృ, దజతనుజద్యుమణిజపురగజిదభుజగగజధ్వ
గ్వ్రిజవిజయినిజయశోమయ, సుజనసుతధ్వజున కధిక శోభానిధికిన్. 101

క. గండరగండని కభినవ, మండలికాఖండమన్నెమార్తాండునకున్
జండప్రతాపపిహితా, జాండునకున్ లోభిమన్నెసురగండనికిన్. 102

క. లక్ష్మాంబానందనునకు, దిక్క్రాంతాచికురనికరదీపితసుమ
ప్రక్రాంతదంతురయశో, ధక్కానిధ కహితకరిఘటాసింహునకున్. 103

క. గాధేయగోత్రసనదము, రాధేయున కఖిలసుకవిరాజికశాఘా
రాధేయదానవిద్యా, రాధేయునకును ధరామరవిధేయునకున్. 104

క. గర్వితబరీదసేనా, సర్వస్వహరానివార్యశౌర్యునకు సమి
ద్దూర్వహసపాదభయదా, ఖర్వమహావిజయభేరికాబాంకృతికిన్. 105

క. పీనవిమలాక్షస్థాపన, మానితకరుణాప్రసంగమాంగళ్యునకున్
ధీనిధికి నృహరిచరణా, ధ్యానవిధానావధానధౌరేయునకున్. 106

క. తోరగంటి దుర్గరాజ్య, స్థిరసింహాసననివాసదీక్షానిధికిన్
పరయంత్రమత్స్యభేదన, బిరుదోద్దండునకు గండభేరుండునకున్. 107

క. ప్రతిదినకనకవసంతా, ర్జితకృతికాంతునకుం దురగరేవంతునకున్
గ్రతుపురనారాయణగృహ, వితతప్రాకారఘటనవిఖ్యాతునకున్. 108

క. అరుణారుణకరుణారస, పరిణామసమగ్రనయనపద్మాభునకున్
శరణాగతభరణాపర, నరసింహున కోబశౌరినరసింహునకున్. 109

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనినయిమ్మహాలంకారప్రబంధం
బునకు నాదికారణం బగునాయకగుణంబులం బభివర్ణించెద. 110

## నాయకగుణములు.

క. కులము మహాభాగ్యము ను, జ్జ్వలతయు దానంబు మహోవిశాలత ధర్మా
కలనయు వైదగ్ధ్యము నన, నిల నాయకగుణము లమరు నివి యోగ్యులకున్. 111

క. వీనికి లక్ష్యము లెల్లను, శ్రీనరసింహేంద్రు పేరఁ జెప్పెద నెలమి
న్నానావిభక్తిసూచిత, నానావిధపద్యగుంఫనసమగ్రముగాన్. 112

కులీనత.—

సీ. ఏవంశమునఁ బుట్టెఁ బావనశ్రుతిధర్మ, పథ్యైకకర్మఠుఁ డైన మనునృపాలుఁ
డేవంశమునఁ బుట్టె నింద్రాదులకు దండ, సత్య మూడినహరిశ్చంద్రనృపతి
యేవంశమునఁ బుట్టె సలఁ జతుర్దశలోకరక్షణదక్షుఁ డైన రావణారి
యేవంశమునఁ బుట్టె నవాపరాచ్యుతపుణ్య, చరితధుర్యుఁడు చోళచక్రవర్తి
తే. యట్టియిందుప్రవారిసేనాధిపత్య
సత్యయశుఁ డైనభానువంశమునఁ బుట్టి
పరఁగుభూపాలసింహు నోబయనృసింహుఁ
దలఁపఁ గలికాలదోషంబు దొలఁగు టరుదె. 113

మహాభాగ్యము.—

మ. ప్రకటాంభోధివిరోధిసైన్యముల గ్రుచ్చఁ బంజాలు నొక్కొక్కనే
ఐపఁ డే వారణవాజిశాలలు సమస్తైశ్వర్యకీర్తిప్రార్పితా
ధిక వేదండహయాన్వితంబులు ఘటాదీప్తాంగదం బుర్విభా
గ్యకళావైభవ మెన్న శక్యమె నృసింహక్ష్మాతలస్వామికిన్. 114

ఔజ్జ్వల్యము.—

మ. స్థిరసోమాన్వయదుగ్ధవార్ధి జనియించె న్వేంకటాద్రీంద్రభూ
వరచంద్రుండు తదీయసోదరిరమావామాక్షి లక్ష్మాంబ యై
పరఁగెం దద్వనితాశిరోమణికి నోబక్షోణిపాలేంద్రుఁ డ శ్రీ
నరసింహాధిపుఁ డై జనించె మరుఁ డౌన్నత్యంబు దీపింపఁగన్. 115

ఔదార్యము —

సీ. అలబలీంద్రునిచేత నడుగు వెట్టఁగ నేర్చి, ధారాధరముచేత నిగుడవోసి
కానీనుచేఁ గంచుకముఁ బూనఁగా నేర్చి, యెలమి దధీచిచే నెముక బలిసి
క్షీరాంబురాశి ద్రచ్చినవెన్న నీడేర, సైలింపగవి చన్నుపాలఁ బెరిగి
కల్పపాదపఫలోత్కరములఁ జవి గాంచి, వనజారి నెయ్యైన ననఁగి పెనఁగి
తే. ధరణిఁ బ్రోదిసహింపనిదానకన్య, సకలయాచకబాంధవు లన్నతింప
నీకరగ్రహణావాప్తి నెఱసె నాగ, సరసగుణహారి యోబయనరసశౌరి. 116

తేజస్విత —

సీ. బహుతరాశాభ్రాన్తి బయిలు ప్రాఁకక యున్నఁ, గువలయద్వేషంబు గోర కున్న
మీఱితమ్ములవిరిపోటు సేయక యున్న, వారుణీసక్తికిఁ బాఱ కున్న
జగతి నందఱఁ దను బగ లొనర్పక యున్న, దోషాభిభూతుఁ డై తూలఁగ కున్న
ద్విజరాజపరిభవోద్వృత్తి సేకొన కున్న, సరసుల నింకింపఁ జాల కున్న

తే. సాటి యగువిశ్వవినుతశశ్వత్ప్రతాప, వైభవధ్వస్తదుర్వారవైరివీరుఁ
డైనయొబయనరసింహు నమితభువన, భవనభృత తేజమున కబ్జబాంధవుండు. 117

ధార్మికత్వము.—

చ. పలుకుట సత్యవాసన కపారవిరోధిజయోత్సవంబు దా
నలఘుయశోధనంబుకొఱ కంబుధివేష్టితభూపరిగ్రహం
బలరు నగణ్యపుణ్యచరితాచరణంబున కాత్మజీవనం
బల సుజనావనంబుకొఱ కౌర నృసింహనృపాలమౌళికిన్. 118

వైదగ్ధ్యము.—

సీ. వనజారికళలచేఁ దనివి నొందించిన, నిలఖేచరుఁడు ప్రాణ మిత్తు ననిన
వనదంబు తనదుజీవన మెల్ల నొసఁగిన, నెమ్మేను శిబి కోసి కొమ్మటన్న
నీగి మ్రానే సొమ్ము లిచ్చినసురమణి, మిన్నంది తలఁపులో మెలఁగు చున్నఁ
జేరి పాదము బలి శిరసావహించినఁ, బాథోధి దా నెంత భంగపడిన

తే. వారి నెవ్వారిఁ గా దని వసుధ నౌర, నిక్కముగఁ గీర్తికామిని నీకుఁ దక్క—
నీదు వైదగ్ధ్యగుణము వర్ణింపఁదరమె, సరసుతాటోప తొరగంటి నరసభూప. 119

క. అనయము నాయకనుగుణము, లనేకములు గలవు వాని నతివిస్తరభీ
తిని రూపింపఁగ లే నిఁక, ననుపమనేతృస్వరూప మభివర్ణింతున్. 120

నాయకస్వరూపము.

క. కీర్తిప్రతాపసుభగుం, డార్తావనుఁ డఖిలగుణగణాఢ్యుఁడు బాహా
వర్తితభూభరుఁ డై వరి, కీర్తితుఁ డగు భర్త కాన్యగీశప్రియుఁడై. 121

కీర్తిప్రతాపసుభగత్వము.—

మ. అరినిర్భేదనధుర్య యొబయనృసింహా సింహాసనత్వాఢ్య నీ
వరసత్కీర్తిమరాళబాలిక భవద్వర్ధిష్ణుశౌర్యప్రభా
భరితారుణ్యముఖాగ్రయై పరఁగుచుం బాల్కీరు నేకంబుగా
ధరఁ గావించుసమస్తవిస్మయకళాదానప్రవీణోన్నతిన్. 122

ఆర్తావనత్వము.—

మ. ఒకప్రహ్లాదుని నార్తుఁ గాచితి మదయోత్సేక మే కొవన
ప్రకటం బౌనె యటంచుఁ దా బహుతరార్తత్రాణపారాయణో

త్సకిత నృసింహుఁ డుర్వీనరసక్షోణీశుఁ డైప్రకటింగా
కోకభూపాలున కిట్టయా రథరణోత్సాహంబు వాటిల్లునే. 123

గుణాఢ్యత్వము.—

చ. అరయఁ బయోధపాత్రమును నంజనశైలము కజ్జలంబుఁ ద
త్సురతరుశాఖ లేఖిని వసుంధర పత్త్రముఁ జేసి వేడ్కతోఁ
గరలి విరించి గేహిని లిఖించినఁ బారము వొందఁ జాల వా
నరసనృపాలమౌళిసుజనస్తుతసద్గుణసంప్రదాయముల్. 124

భూభరణము.—

చ. విపులఫణాసహస్రమున వీఁక ధరింపఁగ నేని మేదిని
న్నిపుణత బాహుపీఠమున నిల్పె నృసింహుఁ డటంచుఁ బన్నగా
ధిపతి నిరంతరాద్భుతమతిం దల లూఁచ జరావిపాండురం
డెపుడుఁ బురాణభోగి యని యెన్నుదు రా భుజగేంద్రు నందఱున్. 125

కావ్యగీతప్రియత్వము.—

మ. నరసింహుం డశిథిలరవీరరసనన్నాహంబు వాటించియుం
గరుణాకోమలుఁ డై రమావిమలశృంగారార్ద్రుఁ డై పొల్చుచా
తురిసాహిత్యజమర్మకర్మకవితోద్యోగాద్భుతుం డయ్యు నీ
నరసింహేంద్రుఁ డెనూనగానరససంధానప్రియుం డెంతయున్. 126

మ. అమరక్ష్మాధరధీర ధీరచితకార్యారంభ రంభాసమ
ప్రమదాభవ్యమనోనురాగఘటనాపాంచాల పాంచాలగో
త్రముఖోర్వీనుతశౌర్య శౌర్యసనలీలాలోల లోలాభవ
ద్రమణీయాగమధర్మధర్మతనయప్రఖ్యాతసత్యవ్రతా. 127

క. కుటిలారిభయదధాటీ, పటుపటహధ్వను నాదపరిపాటితది
క్తటపటలచటులమేధా, పటిమపరాభూతభూతపతిమణిహారా. 128

మాలిని. అలఘునయవిహారా హారనీహారతారా
హలధరరుచిధారా హారకీర్తిప్రచారా
జలధివరగభీరా జైత్రకాక్షేయధారా
లలితగుణవిచారా లక్కమాంబాకుమారా. 129

గద్యము. ఇది శ్రీహనుమత్ప్రసాదలబ్ధకవితాసారసారస్వతాలంకారనిరంకుశప్రతిభా
బంధుర ప్రబంధపతనరచనాధురంధర ప్రబంధాంక వేంకటరాయభూషణా
సుపుత్త్ర తిమ్మరాజపౌత్త్ర సకలభాషావిశేషనిరుపమావధానశారదామూర్తి
మూర్తిప్రణీతం బైన కావ్యాలంకారసంగ్రహం బనుమహాప్రబంధంబునందు
నుపోద్ఘాతప్రకరణంబును నాయకగుణవర్ణనంబును నాయకస్వరూపకథ
నంబు నన్నది ప్రథమాశ్వాసము.

---

శ్రీరస్తు.

# నరసభూపాలీయము

## కావ్యాలంకారసంగ్రహము - ద్వితీయాశ్వాసము.



రాజితసదనకలా
ధారనిరంతరతరార్థిదారిద్ర్యహరా
నారాయణచరణార్చన
నారీజనతారతీశ నరసాధీశా. 1

తే. అవధరింపుము లక్ష్మలక్ష్యముల నెల్ల, ననఘ భవదీయనామధేయాంకితముగ
బహువిభక్తుల నొనరింతుఁ బద్యవితతి, నిచట నాయకభేదంబు లెట్టు లనిన. 2

క. ధీరోదాత్తప్రముఖులు, ధీరోద్ధతధీరశాంతధీరలలితు లీ
ధారుణి నలువురు నాయకు, లారయఁ దల్లక్షణంబు లభివర్ణింతున్. 3

శా. ధీరాత్ముం డవికత్థనుండు గరుణోద్వేలుండు సత్త్వాఢ్యుఁ డా
ధీరోదాత్తుఁడు శౌర్యదర్పకుహనాధీనుండు ధీరోద్ధతుం
డారూఢి న్నమధీప్రసన్నుఁడు ద్విజుం డౌధీరశాంతుండు వృ
త్రారిం దోలినభోగిధీరలలితుం డై పొల్చు నిశ్చింతతన్. 4

ధీరోదాత్తుఁడు:—

సీ. చలిచీమ నేనియుఁ జాఁ ద్రొక్కఁగాఁ జాలఁ, డేరీతి గెల్చెనో వైరివరులఁ
గల నైన నిజవర్ణనలు సేయ వినఁ జాలఁ, డెట్లందుకొనియెనో కృతిచయంబు
చెలు వొందు నాకారచేష్ట లెయ్యెడఁ గానఁ, డెట్లు నవ్వెనో యాత్మహితులతోడఁ
బరుషాక్షరంబులు వలుకఁ డెక్కాలంబు, నెట్లు భర్జించెనో హీనమతులఁ

తే. బరులఁ జేపట్టఁ డెలమిఁ జేపట్టి విడువఁ, డలయఁ డేమఱఁ డరి నైన నఘగుణంబు
లెన్నఁ డోబయనరసధాత్రీశతిలక, మరయ నరలోకభాగధేయంబు గావె. 5

ధీరోద్ధతుఁడు:—

మ. బలవద్వైరిభిదామదాభిరత మై భవ్యప్రతాపోజ్జ్వల
జ్వలనజ్వాలజటాల మై రణభయవ్యాసక్తతన్మనో

జలజాంధంకరణప్రగల్భకుమానాసంపాది యై పొల్చుఁ దా
నిలధీరోద్ధతవృత్తి యై నరసధాత్రీశోగ్రఖడ్గం బనిన్.

ధీరశాంతుఁడు—

చ. ఇనకులధుర్యుఁ డైననరసేంద్రునిచేతఁ బ్రతిష్ఠితంబు లౌ
ననఘ మహాగ్రహారములయందలిభూసురకోటి మేటి యై
ఘనతరశాఖలం జెలఁగి కాంతశుకక్రమ మై మెలంగున
య్యనిమిషభూజవాటి క్రియ నాత్తశుచిప్రసవాభిరామ మై.

ధీరలలితుఁడు—

ఉ. కుంతల గౌళ చోళ కురు ఘూర్జర హూణ శకాదిమేదినీ
కాంతులు సంతతంబు నిజగాఢబలశ్రుతిమాత్రభీతు లై
యింతులరత్నహారముల నెల్ల ధనంబుల నిచ్చి కొల్వ ని
శ్చింతతఁ దాల్చు నోబయనృసింహుఁడు భోగకళాప్రవీణుఁ డై.

తే. మఱియు శృంగారలీలాసమగ్రయోగ్య, తానిశవిచక్షణులు దక్షిణానుకూల
ధృష్టశఠు లనఁ గాంతు లభీష్టమతులు, గలుగ తల్లక్షణంబులు దెలివిపఱతు. 9

చ. చెలఁగుబహుప్రియాసదృశశీలుఁడు దక్షిణుఁ డొక్కకాంతకే
వలచి గుణాభిరాముఁ డగువాఁ డనుకూలుఁడు సాపరాధుఁ డై
యలుగనివాఁడు ధృష్టుఁడు ప్రియాశయమాత్రనివేద్యవిప్రియుం
డలశఠుఁ డంద్రు వీరల కుదాహరణంబులు నిర్ణయించెదన్. 10

దక్షిణుఁడు—

ఉ. సాగరమేఖలాసతికిఁ జారుభుజాపరిరంభ మిచ్చె వా
ణీగగనావలగ్నకును నేర్పు మెయి న్సొగ మిచ్చె వీరల
క్ష్మీగజరాజగామిని కమేయభుజాంతర మిచ్చె సంతత
త్యాగినృసింహభూవిభుఁడె దక్షిణనాయకుఁ డెన్నిభంగులన్. 11

అనుకూలుఁడు—

చ. కనకము లంబరంబులును గ్రామము లుజ్జ్వలదివ్యరత్నమం
డనములు వాజివారణఘటల్ ఘనసారసుగంధసారము
ల్దనివి దలిర్ప వేఁడినకొలంది నొసంగుచు నోబభూపనం
దనుఁ డగునారసింహుఁ డిల దానరమాప్రియుఁ డయ్యె నెంతయున్. 12

ధృష్టుఁడు—

చ. ఉరమున నున్నకుంకుమము నుజ్జ్వలరోషకషాయవీక్షణ
స్ఫురదరుణాంశుపుంజ మని బొంకితి కన్నవకెంపు భాగ్యబం

ధురసహజారుణత్వ మని నూల్కొన నాడితి వెల్లు దాఁచె దీ
పరిమళవాసనాలహరిపర్వెడుమేన నృసింహభూవరా. 13

శఠుఁడు—

చ. కనుఁగవఁ బొఱఁజూచెదవు గాని మనంబునఁ జూడ వుక్తులం
దనిపెదు గాని భారమునఁ దప్పవొకప్పుడు నీప్రవీణత
ల్పనుపడ వింక నీసటలు బచ్చెనచేతలు చాలుఁ జాలునఁ
జెనకకు కీర్తికాంతయె నృసింహప్రియాంగన నీకెఱుంగుమున్. 14

క. ప్రకటీకృతు లగునీనా, యకులకు విటపీఠమర్దు లనఁ జేటవి దూ
షకు లనఁ గలరు ప్రియాకే, లికలాసంఘటనపటిమలీలాచార్యల్. 15

చ. వసుమతి నేకవిద్య గలవాఁడు విటుం డనఁ బొల్చునాయకో
ల్లసనముకన్నఁ గొంతగుణలక్షణహీనుఁడు పీఠమర్దకుం
డసదృశబాలికాసుఘటనాదిరహస్యవిదుండు చేటకుం
డెసఁగ నజస్రహాస్యరసహేతువువాఁడు విదూషకుం డిలన్. 16

క. ఈమతమున స్వీయాన్యా, సామాన్య లనంగఁ గలరు సతులందుఁ ద్రపా
సామగ్రీశీలార్జవ, కోమలకమనీయస్వీయగుణములఁ జెలఁగున్. 17

క. అన్య యనఁగ నన్యోఢయుఁ, గన్యయు సామాన్య యనఁగ గణికామణి యీ
మాన్యల కుదాహరణముల, నన్యాదృశవిశదఫణితి నాపాదింతున్. 18

స్వీయ—

చ. అమృతమువంటిసద్గుణము నంచితచంద్రకళావిలాసభా
వము శివగోత్రభూతియు నవారణఁ దాల్చి యశఃపురంధ్రి దా
గమలవనీహితాన్వయశిఖామణి యైననృసింహమేదినీ
రమణుల కేకపత్ని యన రంజిలులోకము లెల్ల మెచ్చఁగన్. 19

అన్యోఢ—

సీ. పారసీకక్షమాపతులచొ ప్పడఁగించి, నేర్పు మీఱఁగ మోహనిద్ర పుచ్చి
యవనసేనాధినాయకులదోస్తంభసం,భరితప్రతాపదీపంబు లడఁచి
యభిభూతఖానమలాక్కవిస్ఫ్రాతాయశో,ధ్వాంతసంతతికాత్మ సంతసిల్లి
సమదముష్కతురుష్కప్రాప్తసీమల, నడుగు మోపఁగనీక యడుగు దెంచి

తే. ప్రాజ్యసామ్రాజ్య యగువారిరాజ్యలక్ష్మి, కదనసంకేతమున జారకాంత యగుచు
నంచితస్ఫూర్తి నిన్ను వరించె నౌర, వైరిగజసింహ యోబయనారసింహ. 20

కన్య—

శా. ఆజానేయము నెక్కి యోబయనృసింహస్వామివాహ్యాళిరా
నోజం గాంచనసౌధవీథికఁ దదీయోల్లాసముం జూచి మా

తేజోవిభ్రమధన్యకన్యమదనార్తిం జెందిప్రాసాదపా
ళీజాగ్రన్మణిపుత్రికానియతిఁ దాల్చెం దద్గతస్వాంత యై. 21

సామాన్య—

క. ఏరీతి వారుచెందిన, నారీతిఁ దదీయరాగ మందెడినారా
వారాంగన యది సాక్షా, త్కారపుఁబటికంపుబొమ్మ గాఁబోలుఁ జుమీ. 22

క. ఈమగువల కాద్యయు ము, గ్ధామధ్యాప్రౌఢ లనఁగఁ దగునవ్వనయో
వ్యామిశ్రితయోగ్యము లగు, నామములు తదీయలక్షణము లేర్పఱుతున్. 23

చ. నననవకామయౌవనసనాథయు నల్పరతంబు గల్గు న
య్యువిదయె ముగ్ధ మధ్యసదృశోదితయౌవనకామ యై రతాం
తనిపుణ యాలతాంగిసతతప్రథితోల్బణకామయౌవనో
త్సవము రతాదిమోహము దాల్చుతలోదరి ప్రౌఢ దా నగున్. 24

ముగ్ధ—

శా. ఆలాపంబున కుత్తరం బొసఁగ దాయాసంబునం గాని తా
నాలోకింపదు పాటలాధరమరందాస్వాదసమ్మర్దముం
దాళం జాలదు కౌఁగిలియ్యదు తనూతాపంబు చల్లాఱఁగా
నే లజ్జావతితద్రతంబు దయితాభీష్టంబు గాకుండునే. 25

మధ్య—

ఉ. మానితవైఖరిన్మణితమంత్రములం గబరీవినిర్గళ
త్సూనములం బ్రసూనశరశూలినిపూజ లొనర్చి తా రతి
జ్ఞానిని యొప్పె నప్పుడ సమానమనోంబుజవీథి నాతనిన్
ధ్యానము సేయుకై పడిరతాంతనితాంతనిమీలితాక్షి యై. 26

ప్రౌఢ.—

మ. నటదుత్తుంగపయోధరంబు జితమందాక్షక్రియోదారమ
స్ఫుటవాగంకురమక్షికోణనివసత్పుష్పేషుదర్పంబు సం
ఘటితాలింగనవాసనీకృతకుచాగ్రప్రౌఢరోమాంచమై
విటుఁ జొక్కించెఁ బ్రఫుల్లపద్మనయనావీరాయితం బంతయున్. 27

క. ధీర యధీరయు ధీరా, ధీరయు నగు నందు మధ్యధీరాధీరా
ధీరాధీరాహ్వయముల, ధారుణిఁ బ్రౌఢయుఁ జెలంగుఁ దల్లక్షణముల్. 28

తే. తప్పు గలనాథు మ్రోలసోత్ప్రాసఫణితిఁ, గరడము లాడుసతి మధ్యధీర సాశ్రు
పరుషవచనయధీర సబాష్పకుటిల, హారివచనధీరాధీర యనఁగఁ జెలఁగు. 29

తే. కాంతుఁ డపరాధి యైన సాకారగుప్తిఁ, బరఁగి రతివేళ నలయించుఁ బ్రౌఢధీర
తాడనోగ్రయధీరయుదగ్రకుటిల, ఫణితిసంయుక్తయాఖ్యావీరి నేర్పులుతువురుస. 30

మధ్యధీర—

ఉ. మోహమునఘర్మశీకరసమూహము గానఁగ నయ్యె నిప్పు డా
రామవిహారకేలిని ధరంపడినాఁడవొ నన్నుఁ బాసి యీ
రేమదనాస్త్రఘాతముల వేఁగితొ నీయుర మెల్లఁ దద్వ్రణ
స్తోమము సోఁకి యున్నయది చొప్పడఁ గాంత యెఱుంగఁ జెప్పుమా.

మధ్యాధీర—

శా. చాలుం జాలుఁ బిసాళిసేఁతలు పదాబ్జాతంబుపై మాటికిన్
వ్రాలం బోకు ధవత్ప్రియానఖవిమిశ్రం బైన నీవక్షమీ
నీలస్థాపితకుట్టిమం బొరసిన న్వేధించు లే లెమ్ము నీ
బాలాసంగమసౌఖ్యవైభవము నూపన్వచ్చితే యిచ్చటన్. 32

మధ్యధీరాధీర—

చ. పలుక వటంచు నెచ్చెలికి బొమ్ములఁ బెట్టెను కాంత నపయిం
తెలియఁగఁ దప్పు లేమికిని నిన్నఁ జాలక యూరకుండినం
బలుమఱు సాపరాధుగతిఁ బల్కెద వెన్నఁడు దప్పు నీయెడం
గలుగునె యంచు నించెఁ జెలిగన్నుల నీరు లతాంగి యంతటన్. 33

ప్రౌఢధీర—

చ. హితమతిఁ ధూర్తభర్త కెదురేగదు నేర్పున నేకపీఠసం
గతి వారియించి పల్కుటయుఁ గ్రక్కున నెచ్చెలి కూడిగంబులం
జతురత నేర్పుచందమున జాఱఁగఁ ద్రోచి యతిప్రగల్భ యా
సతియుపచారగౌరవము సల్పెదునట్లు వహించుఁ గోపమున్. 34

ప్రౌఢాధీర—

చ. నయనిఁ గృతాపరాధుని సవారణవారణయానయాసునం
గరలి భుజాగుణంబున బిగించి పతంసితసారసంబునం
గరము దమింపఁగాఁ దొడఁగెఁ గాంతుని సాంత్వనశీల లోక్తి లాం
తరసిబిక్రోపతప్తఘృతధారక కారణ వారిధారగాన్. 35

ప్రౌఢధీరాధీర—

చ. బొమముడిపాటు జం కెనయుఁ బూని పురంధ్రులు సాపరాధు లౌ
రమణులు వేడుకొన్న ననురాగము చాల్పను రట్లు గాని మ

త్కృత్రిమ మపరాధ లేశమును దాల్పనినీ విపు డెంతమ్రొక్కినం
చెమలదు శాంతిఁ బొందఁదను మదీయమనం బిఁకఁ జాలుఁ బ్రార్థనల్. 36

క. ధారుణిమధ్యయుఁ బ్రౌఢయుఁ, ధీరాధీరాదిభేదదీపిత లై వే
ర్వేరను జ్యేష్ఠ కనిష్ఠయు, నై రంజిలి ద్వాదశాఖ్య లగుదురు వనుసన్. 37

క. కావున స్వీయత్రయోదశ, భావంబు వహించు నన్యపరఁగు ద్వివిధ యై
యావారాంగన యేకవి, ధావహ యయ్యెన్నఁగాఁ బదాఱ్వుర సుదతుల్. 38

తే. మఱియు శృంగారశంభుసంభావితాష్ట, తనువు లన నిమ్మృగాక్షులు వినుతిఁ గాంతు
రష్టవిధభేదములవీరియాహ్వాయములు, లక్షణము లేర్పరించెద లలితఫణితి. 39

సీ. వరుఁడు నైవస మైనవనితస్వాధీనభ, ర్తృక ప్రియాగమవేళ గృహముఁ దనువు
సవరించు నింతి వాసకసజ్జ పతిరాక, తడవుండ నుత్కంఠఁ దాల్చు నింతి
విరహోత్క సంకేత మునసి నాథుఁడు లేమి, వెస నార్త యాకాంత విప్రలబ్ధ
విభుఁ డన్యసతిఁ జెంది వేకువరాఁ గుందు, నబల ఖండిత యల్క నధిపుఁ దెగడి
తే. యనుశయముఁ జెందు సతి కలహాంతరిత యని, జేశుఁడు విదేశగతుఁ డైనఁ గృశతఁ దాల్చు
నతి ప్రోషితపతిక కాంతాభిసరణ, శీలయభిసారికాఖ్య యై చెలువు మెఱయు. 40

క. ఈరీతిఁ జెలఁగు నతిశృం, గారకలాకలితనాయికామణులకు వే
ర్వేర నుదాహరణంబులు, భూరిమధురసవచనరచనముల నేర్పఱుతున్. 41

స్వాధీనపతిక—

ఉ. శ్రీనిధి యోబభూవరునృసింహుఁడు కైవస మై చెలంగఁగా
భూనుత వైభవస్ఫురణఁ బొల్చు యశోజలజాక్షి నిత్యస
మ్మానితశీల యై ధవుని మన్నన నాదల యెక్కినట్టి వై
మానికవాహిని న్నగు నమందనిజాతిశయంబు పేర్మికిన్. 42

వాసకసజ్జిక—

చ. యవనచమూసమూహముల నాజి జయించి యుదగ్రదిగ్జయో
త్సవవిభవాభిరాముఁ డయి సారెకు నోబయనారసింహభూ
ధవుఁ డరుదెంచు లగ్నమునఁ దత్పురలక్ష్మివిభూషితోల్లస
ద్భవనవిశేష యై మృగమదద్రవవాసనఁ దాల్చు నిచ్చలున్. 43

విరహోత్కంఠిత—

ఉ. నెచ్చెలి లీనృసింహధరణీవరుఁ డెచ్చెద మందుఁ బోయి రా
రిచ్చట నీవునుం గరుణ యించుక లేక లరంప గుంపులన్
గ్రుచ్చెన వేల మాప్రియునిఁ గూర్పుము మన్మథ నీకుఁ దద్విభుం
దెచ్చుటకై యొసంగెద మదీయకటాక్షముల న్నజస్రముల్. 44

విప్రలబ్ధ—

చ. ఎనయఁగ నీనివాసమునకే నరుదెంచెద నంచు నాపయిం
గనుఁగొన నిక్కపుం బ్రియము గల్గవాఁడునుబోలెఁ బల్కి యా
మనికికి రాక తక్కె నను మానెడుఁ గాక మదీయదృష్టికిం
బనుపడి మ్రోల నున్నగతి మాయలు సేయఁగ నేల భర్తకున్. 45

ఖండిత—

చ. నృపులకు నెల్లవారల భరించుట యోగ్యము గాన నేఁటిరే
యపరిమితోత్సవంబునఁ బ్రియాసదనంబుల కేగి యేగి యా
నెపమున మద్గృహంబునకు నీ వరుదేరఁ బ్రభాత మయ్యెఁ గా
కిపుడు నృసింహ నీపయి నొకించుక వంచనలే దెఱుంగుమున్.

కలహాంతరిత—

ఉ. ఆనఁగ రానికోపమున నప్పుడు కాంతుని ధిక్కరించుచో
మానసురాగ్రహాగ్రహము మానుపలేకపు డెఁదుఁ బోయెనో
యీననవింటిదంట యపు డేఁపఁ దొడంగె భవిష్యదర్థము
ల్గానని నామనంబునకుఁ గావలె నిట్టి విషాదవేదనల్. 47

ప్రోషితభర్తృక:—

చ. చిరయశయోబభూవకనృసింహభవద్రిపుభామ కాననాం
తరమున కేగి యందు నిజనాథునిఁ గానక మన్మథార్తయై
వరునిసరోజపత్త్రమున వ్రాయునెడం గరము ల్చెమర్పఁగా
వరయ నిజాంగకం బెపగ యయ్యె నటంచుఁ దలంచు దైవమున్. 48

అభిసారిక—

ఉ. నాతిమదిం బ్రియాభిసరణం బొనరింపఁ దలంచె దీవు చం
ద్రాతపసాంద్రదీధితు లజాండకటాహము నిండఁ బర్వఁగా
నీతలఁ బెట్లు గూడు రమణీవలె నే నొకనన్నెఁ గాఁగ ము
క్తాతతులుం బ్రసూనములు దాల్చు మలందుము గంధసారమున్. 49

క. ఈయెనిమిదిభేదంబులఁ, బ్రేయసులు పదాఱ్వురం బ్రభిన్నాత్మక లై
యాయతగతి నిల నూటిరు, వై యెనిమిది భేదములును వలలును రెలమిన్. 50

క. ఇల నీసంఖ్యలఁ దగుసతు, లల యుత్తమమధ్యమాధమాభిఖ్యలఁ జె
న్నలరఁగ మున్నూ టెనుబది, నలువురు నాయికలటంద్రు నవరసరసికుల్. 51

## కావ్యస్వరూపము.

తే. ఇంకఁ గావ్యస్వరూపంబు లేర్పరింతు, విగతదోషంబులును గుణాన్వితము లధిక
లసదలంకారభావోపలక్షితములు, నైన శబ్దార్థములు కావ్య మనఁ జెలంగు. 52

క. తను వగుశబ్దార్థంబులు, ధ్వనిజీవ మలంక్రియావితానము సొమ్ముల్
తనయగుణంబులు గుణములు, ఘనవృత్తులు వృత్తు లౌర కావ్యేందిరకున్. 53

తే. అందు వాచకలక్షకవ్యంజకంబు, లనఁగ శబ్దప్రపంచంబు వినుతి కెక్కుఁ
ద్రివిధమై యర్థజాతంబు తేజరిల్లు, నవనివాచ్యంబు లక్ష్యంబు వ్యంగ్య మనఁగ. 54

తే. శబ్దవృత్తులు నభిధలక్షణ యనంగ, వ్యంజన యనంగఁ బెను పొందు నందు నభిధ
సతతసంకేతితార్థగోచరసుశబ్ద, ధామ మై యోగరూఢిభేదములఁ జెలఁగు. 55

యోగమూలాభిధ—

చ. అలఘుబలాభిరాముఁ డగునాబళి రాజన్యసింహ మేదినీ
తలబలవైరివానజలధారల నిచ్చలుఁ దేలి తేలి త
ద్గళితవిరోధిశోణితనదమ్ముల నిమ్ములఁ గూడి కూడి యా
జలధులు వాహినీశు లనఁ జాలఁ జెలంగుఁ బయోనిధానముల్. 56

రూఢిమూలాభిధ—

క. కులమణియై బలవద్రిపు, కులగిరికులిశంబు నై యకుంఠితధర్మా
కలనకలాలాలసుఁ డయి, వెలయు న్నరసింహవిభుఁడు విశ్వోన్నతుఁ డై. 57

తే. ఇంక లక్షణవివరింతు, నిందు గౌణ, వృత్తియు నభిన్న మై శోల్చు నెట్లటన్న
క్షోణిసురుఁ డగ్ని యను నెడ శుచిగుణంబు, వాచ్యవిభవాభిభావియై వఱలుకతన.

క. బంధుర యగులక్షణసం, బంధానుపపత్తిమూలభావన నది సం
బంధనిబంధనసామ్యని, బంధన యవి రెండుగతులఁ బరఁగుచు నుండున్. 59

తే. అందు జహదభిధేయము నజహదర్థ, యనఁగ సంబంధలక్షణ యలరు సామ్య
గుణనిబంధన తాను ద్వైగుణ్యమందు, జగతి సారోపసాధ్యవసాయ యనఁగ. 60

సీ. అలగంగలో ఘోష మగు నెడ గంగాప్రదంబు సంబంధి యాతటము దెలుప
సంబంధలక్షణాజహదర్థ యగు నందు, నుంచె మ్రోసె నటన్న మంచగతులు
దోఁచుఁ గోదండపఙ్క్తులు వచ్చె నని విన్న, నమరు యోధులు దోఁప నజహదర్థ
యవనిపాలుఁడు సింహ మనువేళ నదృశతా, గుణసిద్ధిసామ్యలక్షణ చెలంగు

తే. నందు నుపమాన ముపమేయ మప్రభిన్న, మైన సారోప యుపమాన మగది తోప
మేయ మై యున్నసాధ్యవసాయ యిట్టి, లక్షణల కన్నిటి కొనర్తు లక్ష్యములను.

జహల్లక్షణ.—

చ. అగణితశౌర్యధైర్యవిభవాన్విత యోబయనారసింహ నీ
గగనచరామరాగశిబికర్ణజయోన్నతదానలక్ష్మికిన్
జగములు సంతసిల్లె నతిసాంద్రభవజ్జయభేరిభాంకృతి
ద్విగుణితసైన్యఘోషముల వే వడఁకె న్రిపుపట్టణావళుల్. 62

అజహల్లక్షణ.—

క. అసమరణరంగమున నీ, యసినటి నటియింపఁ గరుల హరుల న్నరులన్
వెస నొసఁగు నౌర యెంతటి, రసికుఁడు నీవైరి యోబరాజనృసింహా. 63

సారోపలక్షణ.—

మ. అమరద్వీపవతీర్ఘురాంతరములం దారూఢ నీలాంబుపూ
రము సూర్యాత్మజఁగాఁ దలంపుదురసారప్రౌఢిమైఁ గొంద ఱు
ద్యమతేజోధిక నారసింహ భవదుద్యత్కీర్తినిర్ధూతసం
భ్రమ యాగంగయ కీర్తి దాల్చె నని నే భావింతుఁ జిత్తంబునన్. 64

సాధ్యవసాయలక్షణ.—

క. నిరతబుధప్రహ్లాదా, దరకరుఁడు హిరణ్యకశిపు దానోన్నతుఁడై
ధరఁ బోచిరాజవంశ, స్థిరరత్నస్తంభమున నృసింహుఁడు పుట్టెన్. 65

క. సంగతము లగుపదార్థము, లం గలవాక్యార్థమున కలంకారం బై
రం గగు నర్థాంతర మర, యం గావ్యములందు వ్యంజనాఖ్య చెలంగున్. 66

క. ప్రకృతోపపన్న కభిధకుఁ, బ్రకృతానుపపత్తిగోచరకు లక్షణకున్
బ్రకటితవిభేద్యవ్యంజన, ప్రకృతాప్రకృతోపపత్తిఁ బరఁగెడుకతనన్. 67

ఆ. జగతి నదియు శబ్దశక్తిమూలంబును, నర్థశక్తిమూల మరయ నుభయ
శక్తిమూల మనఁగ సన్నుతిఁ గాంచుఁ దదీయలక్ష్యములను దేటపఱుతు. 68

శబ్దశక్తిమూలవ్యంజన.—

క. ఘనతనృసింహునికరమునఁ, దనరెడునసి నిజసమగ్రధారాగ్ర నిమ
జ్జనతత్పరు లగునరులకు, ననిమిషభావం బొనర్చు ననవరతంబున్. 69

అర్థశక్తిమూలవ్యంజన.—

చ. అలఘుపరాక్రమక్రమసమగ్రభుజాగ్రనృసింహభూప నీ
విలసదనూనదానగుణవిభ్రమ మెంతయు నాలకించి తా
వెలవెలఁ బాఱె మేఘ మరవిందవిరోధియుఁ గందువాఱె నా
కులపడెఁ గల్పశాఖి తృణకోటి గ్రసించె నమర్త్యధేనువున్. 70

ఉభయశక్తిమూలవ్యంజన.—

క. అరిదరకరుఁడై సుమనో, వరభరణధురీణుఁడై యవారితలక్ష్మీ
 స్థిరవాసభాసురుండై, నరసింహుఁడు వొల్చుఁ ద్రిభువనస్తుతమహిమన్. 71

తే. మఱియు రచనాశ్రయంబులై మధురరసని, వేశయోగ్యతవృత్తులు కైశికియును
 నారభటియును సాత్వతి భారతియును, నాఁగ బొగడొందుఁ దల్లక్షణము లొనర్తు.

మ. చెలఁగుం గైశికి కోమలార్థరచనాశ్రీమద్ధతార్థక్రమా
 చలితాడంబరమూర్తి యారభటి యాపత్ప్రౌఢసందర్భని
 ర్మల యౌ భారతి పొల్చు సాత్వతియు నీమత్కోమలార్థక్రమం
 బుల నీవృత్తులకు వ్యథోచితరసస్ఫూర్తుల్ని రూపించెదన్. 73

తే. కైశికి చెలంగు శృంగారకరుణలందు, నారభటి రౌద్రభీభత్సహారిణి యగు
 నలరు భారతి హాస్యశాంతాద్భుతముల, నమరు సాత్వతి వీరభయానకముల. 74

కైశికి.—

ఉ. తిన్ననిమేను గన్నుఁగవ తేటలు దేనియ లొల్కుమాటలుఁ
 సన్నపుఁగౌను గుందనపుఁజాయలు దేఱు మెఱుంగుఁజెక్కులుం
 గ్రొన్నెలవంటినెన్నుదురు గుబ్బచనుంగవ తళ్కుఁజూపులుఁ
 జెన్నెసలారఁ గన్య నరసింహునిఁ జూచె విలాసధన్య యై. 75

ఆరభటి.—

మహాస్రగ్ధర. ప్రతిపక్షక్ష్మాపవక్షః ఫలకవిదళనప్రౌఢగాఢప్రతాప
 ప్రతిభాసంరంభగుంభప్రబలసుబలశుంభన్నృసింహోగ్రరంహో
 యుతమై కల్పాంతదృప్యద్ద్యుమణిధగధగప్రోద్యతజ్వాలజాల
 ప్రతికూలప్రక్రమంబై పరఁగు నరసభూపాలదోఃఖడ్గ మాజిన్. 76

భారతి.—

సీ. నీకీర్తి కెన యని నెగడినసురదంతి, శిరము మధ్యే భిన్నతరము గాదె
 నీకీర్తితోఁ బ్రతినెరసినయిందుమండ, లము పదాఱుఖండములు గాదె
 నీకీర్తి నొరసినకాకోదరస్వామి, తల సహస్రచ్ఛిద్రాకులము గాదె
 నీకీర్తిఁ బోలఁ బూనినధవళాంభోజ, తతి శతధా దళితంబు గాదె

తే. యహహ నీకీర్తికవనిలో నమరకరియు, గిరియు నిందుండు గిందుండు నురగపతియు
 గిరియుఁ దెలిదామరలచాలు గెలువనెరయె, త్రియాబళేంద్రుని నారసింహక్షితీంద్ర.

సాత్వతి.—

చ. ఉభయరగండస్థాపకరణోగ్రజయానకము ల్గుభుల్గుభు
 ల్గుభు లని మ్రోయఁగా భవదకుంఠితవీరభటు ల్ప్రిభుల్ప్రిభు

ల్పవిభు లని శత్రుభూపతులపైఁ జొరఁ బాఱ నెడ న్విభుల్విభు
ల్విభు లని సంభ్రమింపుదురు వేడ్క నఖర్వసుపర్వభామినుల్. 78

తే. ఇంక రీతులు వివరింతు వృత్తు లట్ల, సముచితార్థపదన్యాసస్థాపనములు
గాక సందర్భమాత్రసంగతము లైన, కతన రీతులు వృత్తి భిన్నతఁ జెలంగు. 79

తే. పరఁగురీతులు కోమలప్రౌఢపదవి, ధానవాసన నందు వైదర్భి యనఁగ
గౌడి పాంచాలి యనఁ బొల్చుఁ గ్రమముతోడ, వీనికిని లక్షణంబులు విస్తరింతు.

తే. అతిమృదులబంధయుతయు నాయతసమాస, దనరు వైదర్భిరూక్షబంధయును ఖరస
మాసయగు గౌడియుభయాత్మమహిమగల్గి, యలరు పాంచాలివీనిలక్ష్యము లొనర్తు.

వైదర్భి.—

శా. ఆలావణ్య మగణ్య మాగుణగణం బవ్యాజ మాతేజ ము
ద్వేలం బావినయం బమేయతర మావీర్యం బనిర్వాచ్య మా
యాలాపం బతిసత్య మావితరణం బాశాంతవిశ్రాంత మా
శీలం బార్జవమూల మెన్నఁ దరమే శ్రీనారసింహేంద్రునిన్. 82

గౌడి.—

శా. అంభోరాశిగభీర యోబయనృసింహా నీ రణోదస్తదో
స్స్తంభోత్తంభితజృంభితాసిలతికాసంరంభసంభావనా
దంభానర్గళదుర్గదుర్గమమదోద్యద్భటధృష్టారిరా
ట్ఛుంభచ్ఛుంభనిశుంభసంభ్రమహరస్ఫూర్తి న్విజృంభించురా. 83

పాంచాలి.—

శా. ఆరూఢిం దప మాచరించెదవు చంద్రా యల్లమందాకినీ
తీరక్షోణితటిన్మహానటజటాదీరాటవీవాటిలోఁ
బ్రారబ్ధం బగుమేనియంకము హరింప న్వేఁడి యిం తేల నీ
కారాధింపఁగ రాదె యోబయనృసింహాధ్యక్షుసత్కీర్తులన్. 84

ఉ. పాక ముదీరితార్థపరిపాక మనం దగు నందు గోస్తనీ
పాకము నారికేళఫలపాక మనన్ ద్వివిధంబు గోస్తనీ
పాకము సంవృతార్థపరిపాకనివేద్యము నారికేళపా
కాకలనంబు గూడి నిబిడార్థవిచార్యము వీనిలక్ష్యముల్. 85

ద్రాక్షాపాకము.—

క. వాలిక లై నెలిదమ్ముల, పోలిక లై చందమామ పులుఁగులకును దా
మేలిక లై నసరీక్షణ, మాలికల నృసింహుఁ జూచె మదవతి వేడ్కన్. 86

నారికేళపాకము.—

మ. పరభాషాసులపై మనం బిడక దృగ్వ్యాపార మెంతేఁ బరా
పరసందర్శనవాతిభిన్న మయి చూపట్టంగఁ గార్యాంతర
స్మరణం బేమియు లేక నిశ్చలత నీసాంగత్యముం గోరి మా
హారిణీలోచన యాత్మయందు నరసింహా నిన్నె భావించెరా. 87

క. కదిసి పదంబులు ముందఱి, పదములతోఁ బరమమైత్రిఁ బరఁగి పరపదా
స్పద మన పండితఁ గృతులం, దడిశయ్యతదీయలక్ష్య మాపాదింతున్. 88

క. రతిపతివో చెలువున భా, రతిపతివో నుతగుణాభిరామత రామ
క్షితిపతివో ధర నోబ, క్షితిపనరసింహ శౌర్యజితనరసింహా. 89

## కావ్యవిశేషములు.

తే. ఇట్లు కావ్యస్వరూపంబు నేర్పరించి, యింకఁ గావ్యవిశేషము ల్పొంకపఱుతు
నటనపటుధూర్జటిజటాగ్రచటులసింధు, ఘుమఘుమారంభగంభీరగుంభనముల. 90

తే. వ్యంగ్యము ప్రధానమైనను నప్రధాన, మైన నస్ఫుటమైనఁ గావ్యము త్రిసంఖ్య
నమరు నుత్తమమధ్యమాధమత ధ్వనిగు, ణీకృతవ్యంగ్యమును జిత్రమై కడంగి. 91

ధ్వని.—

సీ. తల యెత్తుకొనఁ గల్గెఁ గులమువారలలోనఁ, బదినూఱుశిరముల పాఁప ఱేని
కనుపముచ్ఛాయావిహార మందఁగఁ గల్గెఁ, జిమ్మచీఁకటి మ్రింగు నెమ్మికాని
కమృతాబ్ధిలో నిద్ర యనధరింపఁగఁ గల్గె, వెలిదమ్మి పొక్కిటి వేల్పుసామి
కలమహానటజటావలభి నుండఁగఁ గల్గె, నెలకొన్న చల్లనివెలుఁగువాని

తే. కవుర భువనాతిశాయివైభవవిభూతిఁ, బూని జగదేకజేగీయమానుఁ డైన
యోబభూపాలునరసింహుఁ డుర్వియందు, నవతరించి శుభస్ఫూర్తి నతిశయిల్ల. 92

తే. ఇందుఁ దలయెత్తుకొనఁ గల్గె దందశూక, పతికి నన నారసింహభూపాలుఁ డుర్వి
తాల్చెననువ్యంగ్యమాదియౌధ్వనులు దోఁపఁ, దనరు నుత్తమకావ్యమై ధ్వనియనంగ.

గుణీకృతవ్యంగ్యము.—

క. కోలు వాస యొసఁగి సురగవి, వెలికిలఁబడుఁ గల్పతరువు వేఁడిన మఱి యా
కులపడి పండ్లిగిలించును, నలువుగ నినుఁ బోలఁగలవె నరసింహనృపా. 94

క. నినుఁ బోలఁగలదె సురతరు, వను నెల లే దనెడివ్యంగ్య మరయఁగ వాచ్యం
బు నతిక్రమించి మించమిఁ, దనరు న్దగ నిది గుణీకృతవ్యంగ్యంబై. 95

క. చిత్రము శబ్దార్థోభయ, చిత్రము లనఁ ద్రివిధగతులఁ జెలఁగునది సు[illegible]
నూత్రితమగుముందఱ నా, చిత్రాలంకారతతులు చెప్పెడి[illegible]టన్. 96

క. ద్వివిధం బగుధ్వనికృతులం, దవిరళగతిలక్షణాభిధాయోజిత మై
యవివక్షితవాచ్యంబును, వివక్షితాన్యపరవాచ్యవృత్తియు ననఁగన్. 97

క. చను నత్యంతతిరస్కృత, మన నర్థాంతరసమేత మన ద్వివిధతఁ గై
కొనియ వివక్షితవాచ్యం, బినుమడి యగువాక్యపదము లెనసిన వడయున్. 98

చ. ననువుగ వీనిలక్షణ మొనర్తు ధృతిం దిరుఁ డన్న ధృష్టుఁ డ
న్ధ్వని యభిభూతవాచ్యముగఁ దత్ప్రథమంబు దెలంగు దానవు
ల్మనమునఁ గ్రొవ్వుమానుఁ డనఁ దద్యవనాళిని ద్రుంచు నీలఁ డ
న్ధ్వని యితరార్థసంక్రమితవాచ్యము గాఁగ ద్వితీయ మింపగున్. 99

తే. అరయ మఱియు వివక్షితాన్యపరవాచ్య, మానిలక్ష్యక్రమవ్యంగ్యమనసలక్షి
తక్రమవ్యంగ్య మన ద్వివిధంబు వీని, లక్షణమ్ముఁ దేర్పరించెద లలితఫణితి. 100

తే. ఇతఁడునరసింహభూపుఁడనుచెపనిదియువ్యంజ
కంబగుచుధృష్టుఁడనెడువ్యంగ్యమునువరుసఁ
దెలుప లక్ష్యక్రమవ్యంగ్య మిల నలక్షి
తక్రమవ్యంగ్య మిట్లు వేద్యక్రమంబు. 101

తే. అందు లక్ష్యక్రమవ్యంగ్య మగును శబ్ద, శక్తిమూలం బనఁగ నర్థశక్తిమూల
మన నుభయశక్తిమూలంబు ననఁ ద్రిసంఖ్యఁ, దాల్చు వేర్వేఱ వీనిభేదము లొనర్తు.

క. తనరారు వస్తురూపం, బనఁగ నలంకారరూప మనఁగ ద్వివిధ మై
ఘనవాక్యపదగతత్వం, బున నాలుగు శబ్దశక్తిమూలము ధరణిన్. 103

సీ. సమధికం బగునర్థశక్తిమూలము స్వతః, ప్రతిపన్నమును గవిప్రౌఢవచన
సిద్ధంబు సుకవినిబద్ధోక్తిసిద్ధంబు, ననఁ ద్రిరూపం బగు నవియు వస్తు
కలితవస్తుధ్వని యలవస్తుకృతదలం, కృతిమయధ్వని యలంకృతినిరూఢ
వస్తుధ్వని యలంకృతిస్తుతాలంకృతి, ధ్వని యన నాల్గుభేదములు వరుస
తే. నొక్కొకటి దాల్ప రతిసంఖ్య నొనరునవియుఁ, దనరుముప్పదియాఱైరిపదప్రబంధ
వాక్యగతభేదముల నిట్లు వఱలు నుభయ, శక్తిమూలంబు నేక మై జగతియందు.

క. నలువదియొకరూపంబులఁ, బొలుపగునీరీతిభేదముల కాస్పద మై
యలసంలక్ష్యక్రమమున, నలరెడువ్యంగ్యం బశేష మాపాదింతున్. 105

క. అసమవిభావాదులచే, రసధ్వని జనించు వేళఁ గ్రమ మెఱుఁగమిఁ దెం
పొసఁగు నలక్ష్యక్రమ మై, యొసఁగినవ్యంగ్యంబు దీనికిల భేదంబుల్. 106

క. పదవాక్యవర్ణరచనా, పదైకదేశములఁ గృతులఁ బరఁగుచు నౌరా
యిది గూడ నలువదే డగుఁ, బదిలముగ వివక్షితాన్యపరవాచ్య మిలన్. 107

క. మును పవివక్షితవాచ్యం, బునఁ గలిగిననాల్గుభేదములు నివి గూడం
దనరుఁ గృతిజీవశుద్ధధ్వని యేకశతార్థభేదవంతం బగుచున్. 108

క. ప్రకృతంబు లైనయీధ్వను, లొకటొకటిం గూడ నేఁబదొకభేదములం
బ్రకటిత మగుఁబ్రాగ్భేదా, బకట ద్వితీయంబు నేఁబదగు నీరీతిన్. 109

క. కృతి నన్నియు నేకైకో, న్నతసముచితసంఖ్య లైకొనఁగ మిశ్రంబుల్
క్షితిఁ బడ్వింశత్యుత్తర, శతత్రయాన్వితసహస్రసంఖ్యఁ జెలంగున్. 110

తే. త్రివిధ మగుసంకరమున సంసృష్టిచేత, నొకటొకటి నాలుగై యివి యొప్పుమీఱు
నవనిఁ జతురుత్తరశతత్రయాక్షిరామ, పంచదశశతభేదప్రపంచగరిమ. 111

క. ఎన్నిక వీనిని లక్ష్యము, లన్నిటకి నొనర్పఁజాల యుగు నమభీతిన్
గొన్నిటి కొనర్తు వినుఁడు ప్ర, సన్నలసన్నవచోవిచారధురీణుల్. 112

అత్యంతతిరస్కృతావివక్షితవాచ్యధ్వని.—

క. ఖరఖురకుట్టనఘట్టిత, ధరణీరజస్థగితసవృశలామదవిచల
త్ఖరకరతురగోత్కర మై, కర మమరు నృసింహఘాటికాహయ మవనిన్. 113

క. ఖరఖురకుట్టనఘట్టిత, ధరణీరజస్థగితసదృశతామదవిచల
త్ఖరకరతురగం బనునెడఁ, దిరస్కృతస్వార్థ మగునది బహువ్రీహిన్. 114

అర్థాంతరసంక్రమితావివక్షితవాచ్యధ్వని.—

ఉ. ఇంద్రసుతుం జయించి నరసేంద్రుఁ డొకమ్మున మత్స్యయంత్రముక్
సాంద్రనిరూఢి నేసె నని సంతతము న్విని తత్తఱించి మ
త్స్యేంద్రుఁడు యోగముద్ర ధరియించి చరింపఁ దొడంగె నౌర ని
స్తంద్రజనంబున న్విపినశైలగుహాగహనాంతరంబులన్. 115

తే. నరసభూభర్త మత్స్యయంత్రంబు నేయ, నలుకమత్స్యేంద్రుఁ డను నెడ నాత్మమత్స్య
శబ్దసామ్యంబుచేఁ గల్గుశంకఁ దనయు, వ్యంగ్య మర్థాంతరసమేతవాచ్య మగుచు.

శబ్దశక్తిమూలాలంకారధ్వని.—

క. ఈకోమలి పద్మిని యఁట, యేకాలముఁ బ్రోచుసినుఁడ వీ వఁట సదా
నీకరసంస్పర్శసహన, గాక చెలంగునె నృసింహ ఘనబలసింహా. 117

తే. ఇందుఁ బ్రకృతంబు లగునృసింహనృపతివాని, కంబు లల పద్మినిశబ్దంబు తెలిమిఁ
గమలినీభాస్కరులఁ గొల్పఁగలుగునుపమ, వ్యంగ్యముగ నియలంకృతధ్వని చెలంగు.

శబ్దశక్తిమూలవస్తుకృతవస్తుధ్వని.—

క. ఆపన్నులార చెప్పెద, మీపాలిటికిని హితంబు మెఱయు నృసింహ
శ్రీపాదకమలసేవా, వ్యాపారము మఱవ కుండుఁ డాత్మలలోనన్. 119

తే. ఇచ్చట నృసింహపదసేవ సేయుఁడనెడు, శబ్దశక్తిని బ్రకృతుఁ డౌజనవరేంద్రుఁ
గొలువుఁడతఁడాపదలు మాన్పుఁగొలుచువారి, కనెడువస్తువువ్యంగ్యమై యతిశయిల్లు.

స్వతస్సిద్ధార్థశక్తిమూలవస్తుకృతవస్తుధ్వని.—

ఉ. చల్లనివాఁడు మానెలవుచందురుమామకడంగి వేఁడుముల్
చల్లనివాఁడు మాయచటిచందనశైలసమీరుఁ డెంచుఁ ద
ద్విల్లవధూమతల్లికల, వేల్పని పల్కు నృసింహమేదినీ
వల్లభ నీవిరోధినృపవల్లభ దుర్లభశైలవాస యై. 121

ఉ. చల్లనివాఁడు మానెలవుచందురుమామ యటన్నఁ దద్ద్విష
ద్వల్లభనష్టభాగ్యవైభవము వ్యంగ్యము తద్ధ్వనిచేత నాయకా
యల్లకమగ్న యౌ ననుట వ్యంగ్యము తద్ధ్వనిచేత వ్యంగ్యమౌ
నెల్లవిరోధిరాజుల జయించె విభుం డనువస్తు వెంతయున్. 122

వస్తుకృతాలంకారధ్వని.—

మ. సలిలచ్ఛాయఁ గుఱించి యంత్రకృతమత్స్యం బీనృసింహక్షమా
తలనాథాగ్రణి యేసె నంచు విని తద్వంశాధిపుం బట్టినన్
సలిలచ్ఛాయఁ గుఱించి యేయు నని యంచద్భీతిమార్తాండునిన్
బలిమిం బట్టెడు వేగ రాహు విధునిం బైకొన్న చందంబునన్. 123

తే. యంత్రమీనంబుమును మూడినట్లుదనుము, ననియకాఁబోలు రాహువన్కని గ్రహింపఁ
దనెడునుత్ప్రేక్షవాచకం బెనయ లేమి, వ్యంగ్య మగునిట్టివాక్యార్థవైభవమున.

అలంకారకృతవస్తుధ్వని.—

ఉ. భూరిభుజాప్రతాపగుణభూషణ యోబయనారసింహ నీ
చారుయశోవధూమణికి సారసవైరిముఖంబు తారక
ల్హారనఖాంకురంబు లల శంకరశైలహిమాద్రు లాత్మవ
క్షోరుహము ల్సితాబ్జములు సొంపగులోచనపంకజాతముల్. 125

తే. తనరుసత్కీర్తికాంతకుఁ దారకాదు, లరయ నంగంబులై వేడ్కఁ బరిణమింపఁ
గలుగుపరిణామమునఁ ద్రిలోకములు నిండు, నరసవిభుకీర్తివ్యంగ్య మనం జెలంగు.

అలంకారకృతాలంకారధ్వని.—

చ. అరిపురభంజనోజ్జ్వలబలాధిక శ్రీనరసింహరాజశే
ఖర భవదీయకీర్తిరుచి గంగ యనంగఁ జెలంగుఁ బొంగుచున్

హరిపదసంగసంకలితయై భువనత్రయపూర్ణయై నిరం
తరతరహంసజాంశుసముదాయ సమన్వితయై వసుంధరన్. 127

తే. రాజశేఖర భవదీయరమ్యకీర్తి, యొనరు నలగంగవలె ననుపమ చేతఁ
బరఁగుచు నృసింహ నీవు శంకరునికరణి, ననుపమవ్యంగ్య మా నిందు నరసి చూడ.

కవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలవస్తుకృతవస్తుధ్వని.—

సీ. ఒంటిగా మడికాసు గుంటిపైఁ గూర్చుండి, సంజకెంజాయ పెన్జడలు దాల్చి
సారిది నేకాలంబు సురనదీస్నాతుఁడై, నిద్దంపుబూది మైనిండ నలఁది
యచ్చుగాఁబులితోలుకచ్చడంబు ఘటించి, యొడలఁబాములు వ్రాఁక నోర్పుగలిగి
హాలాహలానలాభీలధూమము గ్రోలి, యఱచేత హవ్యవాహనము బూని

తే. నీయశోలక్ష్మిఁ బోలు పూనికలఁ దపము, నేడు నొనరించుచున్నాఁడు నీలగళుఁడు
కానియెడ నేల యతని కీగతిఁ జెలంగ, సరసగుణహార యోబయనరసధీర. 129

క. నరసవిభుకీర్తిఁ బోలఁగ, హరుఁడు దపము నేయుచుండు ననువస్తువుచే
సరిగా దాతనికీర్తికి, హరుఁడును ననువస్తు వలరు వ్యంగ్యంబగుచున్. 130

కవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలవస్తుకృతాలంకారధ్వని.—

క. మేలిమి నృసింహధరణీ, పాలు ప్రతాపాగ్ని దిశలఁ బ్రబలినఁ గీలా
భీలదవానలమడవుల, పాలయ్యె జ్జలధిఁ బడియె బడబానలమున్. 131

క. జనపతి ప్రతాప మమరఁగ, వనవాటికి నరిగె దానవహ్ని యనెడిచో
మనమునఁ గలఁగియునుం బలె, ననియెడునుత్ప్రేక్ష వ్యంగ్య మగువస్తువుచేన్. 132

ఉ. అంచితవిక్రమంబున మహాసమరవ్రతదీక్షచే నొపో
షించినకారణంబుననొ శ్రీనరసింహకృపాణ మాజులం
బొంచి మదించి మించు నరిభూభృదకుంఠితకంఠపీఠముల్
ద్రుంచియు వాఁత నంట దలదుఃక్షితిప క్షతజప్రవాహముల్. 133

క. అలఘుగతిని బోషించియు, బలె నంట దురక్త మతనిపటుఖడ్గ మనం
గలిగినయుత్ప్రేక్షవలన, నలఖండన వేగవస్తు వలరుఁ ధ్వని యై. 134

కవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాలంకారకృతాలంకారధ్వని.—

శా. ఆమోదంబున శ్రీనృసింహవిభు దానాంభోనదుల్సాగర
స్వామిం జెంద యశంబు మేఘములఁ బర్వం గల్గువర్షాశర
త్సామానాధికరణ్యశంక నచట న్దామోదరుం డొందుని
ద్రాముద్రానుగతప్రబోధములఁ జిత్రం బేకకాలంబునన్. 135

తే. హారికివర్షాశరద్భ్రాంతి యడరు ననెడి, భ్రాంతిమదలంక్రియారూఢిఁ బ్రబలు నిద్ర
దెలివి నున్నట్టి యోగనిద్రలు నహించు, ననెడి యుత్ప్రేక్ష వ్యంగ్యమై యతిశయిల్లు.

కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలవస్తుకృతవస్తుధ్వని.—

మ. అనురాగాంబుధి యుబ్బి వెల్వడిన యట్టాఘూర్ణఘూర్ణాంబువుల్
దనువల్లిం దిగజాఱఁ గన్నుఁగవ లేఁదళ్కుల్ ప్రసాళించుచున్
ననవిల్కానిపురప్రవేశకలనానాళీకదామంబులై
తనరం గోమలి నిన్నుఁ జూచె నరసేంద్రా సాంద్రతేజోనిధీ. 137

క. ఈవాక్యార్థముచేతను, భూవల్లభ నిన్నుఁ గోరి పోలఁతి విరహా
తావృత్తి నున్న దిపు డను, నావస్తువు వ్యంగ్య మగుచు నతిశయ మొందున్. 138

కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలవస్తుకృతాలంకారధ్వని.—

చ. సురగిరిచుట్టునుం బరిచుట్టెద వేల దినేశరత్నసం
భరితము దేవతాధనముఁ బాయక కాచెద నంచు నేఁటికిన్
సురతరులం గరాంగుళులఁ జొప్పడఁ దాల్చి యశోభ్రగంగచేఁ
బరఁగి నృసింహుఁడే సుకవిపంక్తులఁ బ్రోచె నిదేల యేరికిన్. 139

క. తనరెడు నీవాక్యార్థం, బున శ్రీనరసింహుఁ డఖిలమును బ్రోవఁగ నా
యనిమిషగిరివలెఁ దగు నను, ననుపమ మగునుపమ వ్యంగ్యమై పొగ డొందున్.

కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాలంకారకృతవస్తుధ్వని —

చ. ధరణి ననంతకీర్తియుఁ బ్రతాపముఁ గల్గినరాజ వౌట నిన్
దరణి మనోరవిందమునఁ దాల్చినచుట్టరికంబు పేర్మినో
కరివరయానకు న్విశదకాంతియుఁ గాఁకయు నై కడంగి బి
త్తర మగుమేనఁ గీర్తియుఁ బ్రతాపము నిల్చె నృసింహభూవరా. 141

తే. నెఱయు కీర్తిప్రతాపాఢ్య నిన్నుఁ దలఁప, యశము శౌర్యంబు గలిగిన ట్లలరు వెలఁది
గాఁకయును ననునుత్ప్రేక్షఁ గాంత నేలు, విరహమున కోర్వ దనువ్యంగ్యవిభవ మలరు.

కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధార్థశక్తిమూలాలంకారకృతాలంకారధ్వని —

చ. చెలున యదేమి యామగువ చిత్రమునందు నృసింహభూవరుం
గలయ లిఖించువేళఁ బులకంబులు గ్రొంజెమరుం దలిర్పఁగా
నోలవు వడంకు చున్నది సముజ్జ్వల మైననృపాలరూపమున్
వలపులు రేఁచు చున్న రతివల్లభురూపనిభీతిఁ జెందెనో. 143

క. వరుని లిఖించుచు వడఁకెడి, సరోజశరుఁ డసయో యనెడి సందేహమున
న్నరసింహుఁడు మరుడై వడిఁ, బరఁగు ననెడి యుపమ వ్యంగ్యభావము నొందున్.

క. ఈపరుసఁ బ్రబంధాదిక, తావేలధ్వనులు బుద్ధి ననుమేయము లౌ
నావల రసధ్వనులు రస, భావప్రకరణములం బ్రపంచితము లగున్. 145

తే. ఇచట సుగ్రామనౌఖ్య మై రుచిర మగుగు, ణీకృతవ్యంగ్యవిభవంబు నిశ్చయింతు
నిదియు ననిమిదిభేదంబు లెనయు వీని, ధ్వన్యనామంబు లెఱిఁగింతుఁ బ్రక్రమమున.

క. అగూఢమ నగూఢము నపరాం, గము వాచ్యాంగంబు నప్రకాశము సంది
గ్ధము నల తుల్యప్రాధా, న్యము గా క్వాక్షిప్తమరుచిరాఖ్యము ననఁగన్. 147

క. వనితాకుచకుంభము గతి, ధ్వని గూఢం బైనఁ గాని వైదగ్ధ్యము లే
మినిఁ దగుమధ్యముకావ్యం, బెనిమిదినగలకు నొనర్తు నిల లక్ష్యంబుల్. 148

అగూఢము:—

క. పరిపతితకవాటము లై, పరిపాటితకనకకూటపటవాటము లై
యరినికరపురప్రకరము, లరుదుగ నరసింహుశౌర్య మంతయుఁ దెలుపున్. 149

క. పరిపతితకవాటము లై, యరిపురములు దెలుపుశౌర్య మంతయు ననుచో
నరివరులఁ గెలిచె విభుఁ డని, పరఁగెడివ్యంగ్యంబు గూఢభావముఁ జెందున్. 150

అపరాంగము.—

క. మెడ గ్రుచ్చి కౌఁగిలించును, నొడ లెల్లం బారవశ్య మొందించు నరిక్ష
పడి మోహనిద్ర పుచ్చును, బుడమి నృసింహేంద్రుఖడ్గపుత్రిక యారా. 151

క. రంగుగ నీయెడ ధ్వని యగు, శృంగారము రౌద్రరసవిశేషమునకుఁ దా
నంగం బై విలసిల్లుచు, సంగతి నపరాంగ మనఁగ సన్నుతి కెక్కున్. 152

వాచ్యసిద్ధ్యంగము.—

క. ధారుణి శ్రీనరసింహుని, నీరంధ్రధనుర్వినీలనీరద మమరున్
దారుణతరశరధారా, వారితరిపుశౌర్యసూర్యవైభవ మగుచున్. 153

క. శరధార యనఁగ ధ్వని యై, పరిణత మగుసలిలధారపార్థివునిధను
శ్శరద మనువాచ్యమునకు, ర్వరలో నంగంబు గాఁగ వాచ్యాంగ మగున్. 154

అస్ఫుటము.—

క. శ్రీనరసింహునిభుజస, న్మానితకౌక్షేయకంబు మహీమండలిలో
నానారిపుభూనాథవి, తానార్జితకీర్తిదుగ్ధధారలు గ్రోలున్. 155

క. అరికీర్తిదుగ్ధ మానును, ధరణీశ్వరుఖడ్గ మనుడు దర్వీకరశే
ఖరముగతిఁ బొల్చు ననియెడి, సరసోపమకృతులయందుఁ జను నస్ఫుట మై.

సందిగ్ధము.—

క. నరసింహు నభంగురసం, గరమున నెదురించురిపులు గడు ముందరగా
నరుగుదు రాయితపడుదురు, శరములు విడుతురు సమగ్రసంభ్రమపరు లై. 157

క. అరివరు లాయితపడుదురు, శరజాలము విడుతు రనిన సమరంబున కో
గిరిగుహల కరుగనో యన, సరి వ్యంగ్యము లలరుచుండు సందిగ్ధము లై. 158

తుల్యప్రాధాన్యము.—

క. నరసింహేంద్రునిచరణం, బరుణంబుగ సంఘటింపు డరులార భవ
ద్వరమకుటస్ఫురణంబుల, నరుణం బగునతనినయన మటు గాకున్నన్. 159

క. నరసింహేంద్రునకు నమ, స్కారణం బొనరింప కున్న గాంతారంబే
శరణం బగు నను వ్యంగ్యము, నిర నగువాచ్యంబు సమము లిచ్చట దలపన్. 160

కాక్వాక్షిప్తము.—

క. ఒసగు నెడ గసరు గర్జిలు, నొసగి యొసగి వెల్లబాఱు నొగి నీకరణిన్
విసువక యొసగగ నేర్చునె, యసదృశగతి నంబువాహ మాబళీనరసా. 161

క. ఒసగు నెడ గసరు గర్జిలు, నెసగగ నీలాంబువాహ మిల నీవలె దా
నొసగగ నేర్చునె యనవుడు, నొసగగ లేదనెడివ్యంగ్య మొగి గాకువగున్.

అరుచిరము.—

మ. బలితం బైనమనోజబాణహతిచే బల్మాఱు నిల్వోపలే
కలినీలాలక ప్రాణము ల్వెడలి నేత్రాంభోజమార్గంబునం
గలయం బ్రాకుచు వచ్చి యన్నెలవునం గన్నీటియే అడ్డ మై
నిలుప న్నిల్చె నృసింహభూరమణ మన్నింపంగ బా డింతటన్. 163

క. ఏణాక్షి రాకయున్నను, బ్రాణంబులు విడుచు ననెడివ్యంగ్యంబునకున్
క్షోణి న్వాచ్యముకన్న బ్ర, వీణత్వము లేమి దనరు వెస నరుచిర మై. 164

తే. ఇంక గావ్యప్రభేదంబు లేర్పరింతు, బరుస నష్టాదశవిశిష్టవర్ణనములు
గలుగవలయు మహాకావ్యతిలకమునకు, నెలమి దన్నామధేయంబు లెట్టి వనిన.

క. పురసింధునగర్త్వినశశి, సరసీవనమధురతిప్రసంగవిహారముల్
పరిణయతనయోదయనయ, విరచనయాత్రాజిదౌత్యవిభువర్ణనముల్. 166

తే. ఇందు నొకకొన్నకడ మైన నెంచిచూడ, నదియు నవని మహాకావ్య మనగ బరగు
మఱియు క్షుద్రప్రబంధనిర్మాణమర్మ, లక్షణము లేర్పరించెద లలితఫణితి. 167

క్షుద్రప్రబంధము.—

క. కలికోత్కలికలు పద్యము, లలరారు విభక్తులుం దదాభాసయుతో
త్కలికలు సజయుతిపద మా, నల మాలిని మొదల దగ నుదాహరణ మగున్.

క. అందు విభక్త్యాభాసము, లందు జతుర్థికిని నెను గుదాహరణము పెం
పొందం గలికోత్కలికల, సందీప్తవిభక్తితాలసంప్రాసం బై. 169

క. ముక్తపదగ్రస్తంబై, సక్తాదిమపద్యమై ససంబోధనమై
ప్రోక్తమగుఁ జక్రవాళము, ముక్తమహాధీరశబ్దమోహనమగుచున్. 170

క. ఆచక్రవాళలక్షణ, సూచితమై బిరుదభరితశుభవాఙ్మయమై
యాచక్రవాళవిపుల, క్ష్మాచక్రము నందు బిరుద గద్యము వొల్చున్. 171

క. తరుణీమణిశృంగారము, విరహము మధుమదనగర్వవిభవంబు సరో
వరవనఖేలనములు గల, దరయ న్మంజరి యనంగ నభినుతి కెక్కున్. 172

క. తారక లిరువదియేడును, నారయ నొక్కొక్కపద్యమందుఁ జెలంగం
గూరిచినపద్యమాలిక, తారావళి యనఁగ నభినుతంబై పొల్చున్. 173

మ. ఫణిశుంభద్భుజసారసారసముఖీపంచాయుధాకారకా
రణసంతత్యవతారతారగిరిధైర్యస్థేమమర్యాదవా
రణసమ్రాడ్బలభారభారవికవిప్రౌఢోక్తిసంచారచా
రణసంస్తుత్యవిహారహారహారవిభ్రాజద్యశోవైభవా. 174

ఓష్ఠ్యము.—

క. భూమిసుమనోమరద్రుమ, వామప్రద్యుమ్నభానువంశోద్భవపా
లోమిమావిభుశుభవైభవ, భీమోపమభీమభీమపృథుదోర్విభవా. 175

పంచచామరము ఘనాఘనాఘనాశదాధికప్రగానరంజనా,
జనావనాదినాగతల్పసత్కవిప్రసాధనా,
ధనాధినాథనందనాబ్జదర్పకాంగవాసనా,
సనాతనాధునాతనాతిశౌర్యధుర్యలంఘనా. 176

గద్యము. ఇది శ్రీహనుమత్ప్రసాదలబ్ధకవితాసారసారస్వతాలంకార నిరంకుశప్రతిభా
బంధుర ప్రబంధపతనరచనాధురంధర ప్రబంధాంక వేంకటరాయభూషణ
సుపుత్త్ర తిమ్మరాజపౌత్త్ర సకలభాషావిశేషనిరుపమావధాన శారదామూర్తి
మూర్తిప్రణీతంబైన కావ్యాలంకారసంగ్రహం బను మహాప్రబంధంబునందు
సర్వరససాధారణనాయకవర్ణనంబును శృంగారనాయికాఖ్యానంబును రీతి
వృత్తిప్రశంసయుఁ బాకశయ్యాప్రపంచనంబును గావ్యభేదప్రకరణంబును
మహాకావ్యప్రకటనంబు శేషప్రబంధమార్గదర్శనంబు నన్నది ద్వితీయా
శ్వాసము.



శ్రీ ర స్తు.

# నరసభూపాలీయము

## కావ్యాలంకారసంగ్రహము - తృతీయాశ్వాసము.

---



రమణచరణసేవా
పారాయణ యుభయవంశపావన లక్ష్మీం
ధారచితభాగధేయ య
పారకృపాసరస యోబపార్థివనరసా. 1

తే. అవధరింపుము లక్ష్మలక్ష్యముల నెల్ల, ననఘ భవదీయ నామధేయాంకితముగ
బహువిభక్తుల నొనరింతుఁ బద్యవితతి, నిచ్చటఁ బ్రబంధజీవితం బెట్లటన్న. 2

తే. మహితకవితావిలాసినీమధురతరవి, లాసవిన్యాసములలీలవాసి కెక్క-
నవరసంబుల నెఱిఁగింతు నవరసార్థ, గుంఫగంభీరతరవచో జృంభణముల. 3

క. పులకండంబులు గలిపిన, నలువగుసలిలము రసాయనం బగుపగిదిన్
లలితవిభావాదులచే, నలఘు[1]తరస్థాయిభావ మమరున్ రసమై. 4

స్థాయిభావలక్షణము.—

తే. గరిమ నదులెన్ని గలిసినఁ గప్పుకొనుచు, జలధి గనుపట్టురీతి[2]సంచారిభావ
సంచయము లెన్ని గలిపిన మించ నీక, తాన కనుపట్టుభావంబు స్థాయి దలఁప.

క. ధర శృంగారము హాస్యము, కరుణ[3]యు వీరము భయానకము బీభత్సం
బురరౌద్ర మద్భుతము, శాంతరసంబును రసము లనఁగఁ దనరుం గృతులన్. 6

క. రతిహాస[4]శోకయత్నము, లతిభీతి జుగుప్స రోష మచ్చెరువు శమం
బతులక్రమమున నివి సాం, ప్రతము రసస్థాయిభావభావనఁ జెందున్. 7

క. రసములకుఁ దొమ్మిదింటికిఁ, బొసఁగిన యీస్థాయిభావములకు నొనర్తున్
రసికతలక్షణలక్ష్యము, లసదృశరసశాస్త్రవేత్త లౌనా ననఁగన్. 8

రతి.—

క. తరుణీమణులకుఁ [5] బురుషుల, కరయఁగ సంభోగవిషయ మగునభిలాష
స్ఫురణము మనములఁ బొడమిన, ధరలో నది రతి యనంగఁ దగు నెట్లన్నన్. 9

---

1 వయిన. 2 నిజగతి. 3 ము. 4 శుగుత్సాహ. 5 దరుణుల.

ఉ. చల్లఁదనంబె చంద్రునకుఁ జక్కఁదనంబె ప్రసూనధన్వికిన్
సల్లలితోరుసౌరభమె చైత్రున కొక్కని కొక్క మేలిమే
తెల్లము గాక నాపతి యుదీర్ణగుణాఢ్యుఁడు నారసింహభూ
వల్లభుఁ డట్లు సర్వగుణవైభవ మెవ్వరికైనఁ గల్గునే. 10

హాసము.—

క. చేకొని [1] యప్రారము లగు, నాకారవికారచేష్ట లాలోకింపన్.
గైకొనుమనోవికాస, స్వీకారము హాస మయ్యె విను మె ట్లన్నన్. 11

చ. అదె యిదె వచ్చె వచ్చె నరసాధిపు దాడి యటంచుఁ బౌళము
ల్పెదరి బరీదుఁ డేఁగుకెడఁ బెంపటి ఖానులు వెన్కముందుగాఁ
గదిసి హయాళి నెక్కి హయకంధరము ల్గ్రవడగాన కప్పుడే
చదిపిరి వాజిమస్తముల శత్రు లటంతు భ్రమింతు రెంతయున్. 12

శోకము.—

క. హితజనవిర [2] హావ్యథచే, నతిశయ మై జనులమానసాంభోజమునన్
బ్రతిదినముఁ బొడవుదుఃఖం, బతిభూమి సహింప శోక మగు నె ట్లన్నన్. 13

చ. పతుల నృసింహశౌర్యశిఖిపాలుగఁ జేసినయట్టి పాపపు
న్నతధృతి కంతటం జలము జాఱుచు మమ్ము దావపావక
ప్రతతులపాలు చేసె నని పల్కుచు రోదన మందువిద్విష
త్సతులకు బాష్పపూరములె చాలు వనానలమున్ హరింపఁగన్. 14

ఉత్సాహము.—

క. అత్యున్నతలోకోత్తర, కృత్యంబులు సేయ వేఁడి కృతకృత్యు లిలన్
నిత్యము దలఁచుప్రయత్నం, బత్యంతోత్సాహ మయ్యె నది యె ట్లన్నన్. 15

మ. అసిఁ జెండాడి విపక్షపృథ్వీపుల శౌర్యాగ్నిచ్ఛటం జేల్చి శ
స్త్రసరత్సీరములన్ రణోర్వీతలమున్ సంక్షుణ్ణముం జేసి వై
రిస్పృహార్ద్రిం బొనరించి ప్రోది గొన కుద్యత్కీర్తి సస్యౌఘము
ల్వైస సిద్ధించునె యంచుఁ బల్కు నరసోర్వీనాథుయోధావళుల్. 16

భయము.—

క. క్రూరాకా[3]రము చూచిన, నారయ[4] నే జనునిహృదయమందు ననర్థాం
కూరాశంకన మగు నది, ధారుణిలో భయ మనఁగఁ దగు నె ట్లన్నన్. 17

చ. అనఘ నృసింహ నీయరి వనావళి కేఁగి గుహాగ్రసుప్తుఁడై
యని మరలం గలం గని భయంపడి పాఱుచు నాజి కాను కా

---

1 యతివికృతము లగు, నాకారాలాపచేష్టితాదులు చూడన్. 2 హాదులచే.
3 రాదికమున. 4 గా.

దని సతి చెల్వినం దెలియఁ డౌర నిషాదులఁ జాపహస్తులం
గని విపినేభపంక్తిఁ గని క్రమ్మఱ నాజియకాఁ దలంచుచున్. 18

జుగుప్స.—

క. పలలాస్థిశోణితాదులఁ, బలుమాఱును జూచి నరుచిభావము లోనం
దళుకొత్తు నిగర్హణ మది, తలపోయ జుగుప్స యనఁగఁ దగు నెట్లన్నన్. 19

చ. తలలు సరోజము ల్పదడు తండెము క్రొన్నురు వంత్రజాలముల్
జలఘటు లస్థిఖండములు శంఖము లై తగు నెత్తుటేర్లలోఁ
గలభకపాలనౌచయము గ్రిక్కున నెక్కి చరించు సంగర
స్థలుల నృసింహనిర్దళితశత్రుపసారసమత్తభూతముల్. 20

క్రోధము.—

క. అపకారకారు లగునరు, లపరాధ మొనర్ప 1 నే మహామహునిమనం
బు పరిజ్వలితం బగు నది, యపరిమితక్రోధ మయ్యె నది యెట్లన్నన్. 21

చ. స్థిరభుజవిక్రమక్రమనృసింహ నృసింహ భవత్కరాగ్రభీ
కరకరవాలసిద్ధిఁ దతిగాఢయశోరససిద్ధిఁ గోరి బం
ధురహయసింధురావళుల తోరణదుర్గకనద్గళోన్నతి
న్నరబలి వెట్టు దుర్మదసనాథరిపుక్షితినాథయూథమున్. 22

విస్మయము.—

క. వివిధాపూర్వము లగువ, స్తువులు గనుంగొనినయెడల సుజనునిమది 2 లో
దవిలిన 3 ప్రమోదవిస్తర, మవిరళవిస్మయ మనంగ నగు నెట్లన్నన్. 23

చ. ధరణి నృసింహభూవరుప్రతాపమహాతప మబ్జజాండక
ర్పరములు నిండి తీవ్రగతి బర్వ నఖర్వసగర్వవైరిభూ
వరులు వడంక సాగుదు రవార్యనవవ్యాజనాతపత్రవై
ఖరులు దొలంగఁ జేయుదురు కన్నులఁ జీఁకటి కప్పుచుండఁగన్. 24

శమము.—

క. నిరుపమవైరాగ్యాదుల, కిర వై నిశ్చలత పూని హృదయము తిర మై
నరులకుఁ బరిణతిఁ జెందిన, ధరలో నది శమ మనంగఁ దగు నెట్లన్నన్. 25

ఉ. హారిభవాదిదుఃఖములఁ గుందఁగ నేల నృసింహుఁ డౌర దు
ర్వారఫలప్రదం బగువిరక్తిసుఖం బొనరించె నంచు నీ
వైరులు మాను లై విపినవాటిని నీవ గురుండ వంచు నీ
పేరిటి యక్షరంబులె జపింతురు శ్రీనరసింహభూవరా. 26

---

1 ఁగా. 2 కిం. 3 విస్తారంబది, య.

స్థాయిభావకారణము.—

క. ఈరసముల కుత్పాదన, కారణము విభావ మనఁగ గల దది ద్వివిధం
బై రంజిలు నాలంబన, మారయ నుద్దీపనంబు ననఁ 1 గ ధరిత్రిన్. 27

విభావస్వరూపము.—

క. వనితయుఁ 2 బతియును నాలం, బన మగు నుద్దీపనంబు ప్రాయంబును సొ
మ్మును జేష్టయు మదనాదులు, ననఁ దగు నేర్పఱతు వీని కగులక్ష్యంబుల్. 28

ఆలంబనవిభావము.—

చ. అలరురతిన్ రతీశు దమయంతి నలున్నలు వొంద ముందుగా
నలువ సృజించి యందుకు తనం దనచేయలు కెల్లఁ దీటి సే
ర్పలవడ నీలతాంగి నరనాథప నిన్నును గూర్చె ప్రేమసం
కలితముగాఁగ దంపతులుగా నొనరింపఁగఁ బోలు నెంతయున్. 29

ఉద్దీపనవిభావము.— ప్రాయము.

మ. వరవక్త్రంబువిలాసకృష్ణనవయోవర్షావసానంబునం
దరుణీశైశవసింధు లింకునెడఁ దత్తత్కాలలక్ష్యంబు లౌ
సరసాంతస్థితగండశైలము లనం జాదోయి యంతంతకుం
బరఁగుం దత్క్రమశోభ రేఖ లనఁ గన్పట్టు న్వళీపుంజముల్. 30

సొమ్ము —

క. వెలఁదికి మణితాటంకము, లలరున్ దిగ్విజయకాంక్ష నతనుఁడు చూపుం
జిలుకులు నిశాతములుగా, నలవడ వడిఁ దీడుశాణ యంత్రము లనఁగన్. 31

చేష్ట.—

చ. సుదతి నృసింహుని న్మరల చూచె విలాసవివర్తితాస్య యై
వదలనిప్రేమ వెన్నవిలి వచ్చె ముఖేందుఁ డటంచు భీతచేఁ
జెదరి గిరీంద్రదుర్గములు సేరినచీఁకటి వోలె వాసనా
స్పద మగువాలుఁగొప్పు వలిచన్నులపై ననియాడుచుండఁగన్. 32

తటస్థములు.—

చ. చిగురుఁగటారితోఁ జెఱకువింగిణితో నలరంపగుంపుతో
నిగనిగమించుచెంగలువ నేజముతోఁ బడిఁ జిల్కతేజిపై
మగఁటిమి నెక్కి శూరుఁడయి మారుఁడు కోకిలకంఠకాహళుల్
నెగడ లతాంగిపై వెడలె నేఁడు నృసింహ యెఱుంగఁ జెప్పితిన్. 33

1 గారతికిన్. 2 బురుషుఁడు.

క. కారణ మైనవిభావము, చే రస ముత్పన్న మైనఁ జెలఁగెడిదానం
బ్రౌరూఢకటాక్షాదిక, మారయ ననుభావ మయ్యె నది యె ట్లన్నన్. 34

చ. అలసాలోలము లై యచంచలము లై యాకేకరాగ్రంబు లై
యలఘువ్రీడము లై యనిందితము లై యానందపూర్ణంబు లై
సులభాసూయము లై సుతీక్ష్ణగుణము లై సువ్యక్తరాగంబు లై
చెలువం బొందెడుచూపు లింతి నెఱపెన్ శ్రీనారసింహేంద్రు పైన్. 35

క. పరగతసుఖదుఃఖాదుల, నరయఁగ భావించి యట్లు యలరుట సత్త్వ
స్ఫురణము తద్భవభావము, లరయఁగ సాత్త్వికము లయ్యె నని యె ట్లన్నన్. 36

ఉ. స్తంభ మచంచలత్వ మవశత్వ మగుఁ బ్రళయంబు దృగ్జలో
జ్జృంభణ మశ్రు వౌఁ జెమట స్వేదము గద్గదవాక్యవైఖరీ
గుంభము నిస్స్వరత్వము తగుం బులకం బన రోమహర్షణా
రంభము కంప మౌ వడఁకు రామకుఁ బాండురుచుల్ వివర్ణతల్. 37

క. తలఁపఁగ రసకార్యము లై, జలజాక్షులయందుఁ బొడము సాత్త్వికభావం
బుల కెనిమిదింటి కేర్పడ, నలరింతుం గడఁకతో నుదాహరణంబుల్. 38

స్తంభము.—

చ. కలికి నృసింహభూవరునిఁ గన్గొని నిశ్చలగాత్రవల్లి యై
యలరు విలాసచేష్టలాలయం గలయంగ నటింపఁ జేయునా
వలపులసూత్రధారుఁ డనవద్యనృపాకృతిఁ జూచి తాను ని
శ్చలత వహింపఁగాఁ గదలఁ జాలనిజంత్రపుబొమ్మయో యనన్. 39

ప్రళయము.—

ఉ. ఇత్తఱి సీతలోదరి వహించె నచేతనవృత్తి శారదా
చిత్తముఁ జూఱగొన్న నరసింహుఁడు నేఁడు నియోగపాండువా
గుత్తపుగుబ్బలాఁడి పలుకుంజవరాలివలెం జెలంగఁగా
నిత్తరళాక్షిచిత్తము నహీనరసోన్నతిఁ జూఱవెట్టెనో. 40

చ. మగువకు నంగజానలసమగ్రము లౌనులివేఁడియూర్పుం
బొగ లెగయ న్జనించుగతి ముత్తెపుఁజిప్పలఁ బోలు ఱెప్పల
న్నెగడునుదశ్రుపూరములు నేత్రసరోరుహనాళిచాతురిం
డిగియె నృసింహ యింకఁ దరుణీమణిఁ గౌఁగిట నాదరింపుమీ. 41

స్వేదము—

చ. పతికిఁ జెమర్చె మేను జలజాతదళాక్షి చతుస్సముద్రము
ద్రితవసుధాధురంధరుని శ్రీనరసింహుని భావవీథిలోఁ

ప్రతిదినము న్వహించు నతిభారము వంకనో కాక సంతతా
పతదసమాస్త్రశస్త్రభవపావకకీలల వేఁడివంకనో. 42

చ. అమరఁ బరాగనానఖముఖాంకితుఁ డైననృసింహభూవరుం
గమలదళాక్షి చూచి ప్రమదమ్మున దూఱెద నన్న గద్గద
త్వమునఁ బొసంగ వయ్యె సతివాక్యము లాంతర మై చెలంగునె
య్యము హృదయేశు దూఱవల దంచు నిరోధ మొనర్చెనో యనన్. 43

రోమాంచము.—

చ. కలికి నృసింహునిం దలఁపఁ గా నెలమిం బులకప్రకాండము
ల్మొలచె మనోజహాలికుఁడు మోద మెసంగఁ గురంగనాభపం
కిల మగునింతిగాత్ర మను క్షేత్రమున న్వలయంగఁ జేయున
స్ఖలితమనోనునోరథనికాయము లీరిక లెత్తెనో యనన్. 44

కంపము.—

చ. చెన్నగుక్రొన్నృసింహవిభుఁ జిత్రపటంబున వ్రాసి బింకపుం
జన్నులమీఁద జేర్చుకొని చాల వడంకఁ దొడంగె బాల దాఁ
గన్నులవింటివాఁడు త్రిజగంబు జయించెద నంచుఁ గోరి చే
నున్నకృపాణవల్లిక మహోజ్జ్వలత న్జళిపించెనో యనన్. 45

వైవర్ణ్యము.—

ఉ. మానవతీలలామ యసమానసముజ్జ్వలగాత్రవల్లి పైఁ
గానఁగ నయ్యెఁ బాండురతరకాంతి నిరంతర మై మనంబునన్
శ్రీనరసింహభూవరు ధరింపఁగఁ దద్వదనేందుమండలీ
మానితచంద్రికారససముజము పైపయిఁ బర్వెనో యనన్. 46

క. ఆహారహము రసోత్పత్తికి, సహాయభావంబు లెలమి సంచారు లగున్
మహి నవి ముప్పదిమూఁడై, మహితము లగు వీనికిం గ్రమం బేర్పఱతున్. 47

శా. నిర్వేదశ్రమదైన్యజాడ్యములు గ్లానిత్రాసశంకాత్తరరు
ద్గర్వావేగధృతిస్మృతు ల్చపలతోగ్రత్వావహిత్థాత్రపాం
తర్వైవర్ణ్యమదోత్సుకత్వసుతినిద్రామోహబోధాంతము
ల్స్వరవ్యాలస్యవితర్కసుప్త్యసహతాధ్యానభ్రమాపస్మృతుల్. 48

క. ఈవరుసఁ ద్రయస్త్రింశ, ద్భావములకు లక్షణము లుదాహరణంబుల్
వావిరి నొనర్తు నయ్యెడఁ, గేవలశృంగారసూత్రకీలితఫణితిన్. 49

క. నిరుపమదుఃఖేర్ష్యాదుల, నిరతము జనియించునరతి నిర్వేద మగున్
సురతగమనాదిసంభవ, సరసస్వేదాంబులహరి శ్రమ మెట్లన్నన్. 50

నిర్వేదము.—

క. శిలలు మణిభూషణంబులు, చెలువ నసుహారములు జలధిఁ జిందినచినుకుల్
తలిరాకుఁబోఁడి నా కగు, సులభదయానిధి నృసింహుఁ జూడక యున్నన్. 51

శ్రమము.—

క. నరసేంద్రుఁ జూడ రయమున, నరుదెంచి లతాంగి శ్రమజలాపూరిత యై
సరసేందుకిరణపరిణతిఁ, గరఁగిన నెలచట్టుబొమ్మ కైవడి నమరెన్. 52

క. బల మఱి యరికిన్ దయ రాఁ, బలుకుట దైన్యం బనంగఁ బరఁగు న్మదిలోఁ
గలకోరిక చేకూరిన, నల వెఱుఁగక యునికి జాడ్య మగు నెట్లన్నన్. 53

దైన్యము.—

క. మదన మదిరాక్షి లక్ష్యమె, మొదలఁ బురాంతకుని నిక్క మోయించిన నీ
కిది మొదలు కరుణఁ జూడుము, సుదతి న్నరసింహుఁ గూర్పు సుకృతము గల్గున్.

క. కడు శక్తి యెడలి బడలిక, నడలుట యది గ్లాని యయ్యె నాకస్మిక మై
పొడము భయంబునఁ జిత్తము, తడఁబడు టది త్రాస మనఁగఁ దగు నెట్లన్నన్.

గ్లాని.—

క. నిండదె బడలిక మును చను, కుండలబయ వాఁగలేని కోమలిమేనం
గొండంతవలపు పుట్టిన, గండరగండాంక యోబఘననరసింహా. 56

త్రాసము.—

క. మఱుఁ జిత్రలిఖితుఁ గని బి, త్తరి వెఱనఁ బరాగభూతిఁ దగ నిడి చిగురా
కరయ దిగఁ దుడిచి యలులకు, విరిబోనము వోయఁ దెలిసె వెఱపు నృసింహా. 57

క. తనకు ననిష్టం బగునో, యని గొదుకుట శంక హృదయమందలితాపం
బినుమడి యై వెలిఁ బర్విన, ననయముఁ దనుపీడ యార్తి యగు నెట్లన్నన్. 58

శంక.—

క. చిలుకలపలుకో యని విన, నలుకుం జెలిపలుకుఁ దలఁకు నద్దము మాడం
గలునల చెలికాఁడో యని, చెలువ వియోగంబుకతన శ్రీనరసింహా. 59

ఆర్తి.—

క. బెడిదపుమదనజ్వరమున, మిడిసి పడుక్ హారలతలు మృగలోచనకున్
వెడవిలుతు వింటికోలల, వడువున సతి నింక నేఁప వలదు నృసింహా. 60

క. ఎంచును గృతాపరాధుల, యందు మనం బెరియ రోఁష మగు నది యొరులక్
నిందించి తన్నుఁ బొగడున, మందోన్నతి గర్వ మయ్యె మహి నెట్లన్నన్. 61

రోషము.—

క. నిలునిలు మనంగ యొచటికిఁ, దొలఁగెదు నరసింహుఁ డింతితోఁ గూడినఁ జా
లలరు భవదీయచాపము, కలుగానుగఁ ద్రిప్పి పిప్పిగాఁ గావింతున్. 62

గర్వము.—

క. ప్రతియె కలంకాంకితునకు, సతి యగురోహిణియు నతనుసతి యగురతియుం
జతురనృసింహునిఁ జెందిన, యతిధన్యకు నాకు ననుచు నంగన నవ్వెన్. 63

క. క్రమమున నిష్టానిష్టా, గమజమునస్సంభ్రమంబు గన నావేగం
బమరంగ మనము కృతార్థ, త్వముఁ జెందిన ధృతి యనంగఁ దగు నెట్లన్నన్.

ఆవేగము.—

క. సతి హారము నిడె నెడలే, కతనునితనుసిద్ధిఁ గోరి యల రతిప్రతసం
గతి నక్షసరము గైకొను, గతిఁ గేలన దాల్చి నృపతిఁ గనుఁగొన నరిగెన్. 65

ధృతి.—

క. నరసేంద్రుఁడు రా కుండినఁ, బరునడి భావింపఁ గలుగుభాగ్యమె చాలుం
జరితార్థనైతి మరునకు, గిరనరుఁ బ్రియ మేల పల్కఁ గీడ్పడి నాకున్. 66

క. స్మృతి యగుఁ బూర్వానుభవ, స్మృతి రాగద్వేషజనిత చేష్టాద్యనవ
స్థితిచాపల మొగ్గొదవిన, నతిచండత యుగ్రభావ మగు నెట్లన్నన్. 67

స్మృతి.—

క. నాఁటిపరిరంభసౌఖ్యము, నేఁటిబలెం బాయ దాత్మ నిండి తొలఁకుచుఁ
బోటి నృసింహునిఁ బాయని, పాటలసుమగంధు లెంత భాగ్యాధికలో. 68

చాపలము.—

క. వనిత నృసింహునిఁ గనుఁగొని, చనుగుబ్బలమీఁదివలువ చక్కఁగ దిద్దుచున్
జనఁ జూచు మరలుఁ జెలితోఁ, బనిలేమియుఁ బలుకు సురముపయిఁ జేయిసేర్చున్.

ఉగ్రత —

క. వలను వల దేఁచఁ గలువల, చెలికొండ నృసింహుఁ గూర్పు చెలిఁ గాకున్నన్
బోలఁతుక నిట్టూర్పుఁబొగ, ల్వోలునడి నిబింబ మొల్ల వెస మాయించున్. 70

క. భువిలో నాకృతిగోపన, మవహిత్థ మనంగ ముసుఁగు టని ప్రపముంకిన్
వివిధోపాయాభావా, ద్యవిరళశంగిము విషాద మగు నెట్లన్నన్. 71

అవహిత్థ.—

క. హారములు గరఁగ నరస, త్మారమణునిఁ బాడి యొక్కసతి పులకలు పై
నీరిక లెత్తిన దాఁచును, సారెకు హారాంబుజనితశైత్యం బనుచున్. 72

క. వనిత నృసింహేంద్రుఁ బరా, కునఁ జేర్కొని శిరము వంచుకొను జలియెదుటన్
గనిపించె భావ మని మో, మునఁ జుము గుచదుర్గ వసతి సాఁగినభంగిన్. 73

విషాదము.—

క. అలరులు మరునమ్ములు హిమ, జల మింసుకరోదితంబు శత్రువు దలఁపం
జలిగాడ్పు శ్రీనృసింహుం, దలిగినవాఁ డెట్లు మాను నతివకుఁ గాఁకల్. 74

క. మదము మదిరాదికృతస, మ్మదమోహవ్యతికరంబు మతి యౌత్సుక్యం
బదన సమయాక్షమత్వము, మది నర్థవినిగ్రహయంబు మతి యెట్లన్నన్. 75

మదము.—

క. అమరున్నృసింహునివనమున, నమితాసవరసము లాని యలియూవతముల్
భ్రమియించు నాడుఁ బాడును, రమణులతోఁ గూడి సాంద్రరాగప్రౌఢిన్. 76

ఔత్సుక్యము.—

క. నరుఁ బిలువఁబనిచి యెపుడెపు, డరుదెంచునో యనుచుఁ దలఁచి యభిముఖియగుచి
త్తరి యింతపరాకైనను, నరయఁ దదాలోకవిఘ్న మగు ననుభీతిన్. 77

మతి.—

క. చెలువరో శ్రీనరసింహుం, డలనాఁటి నృసింహమూర్తి యగుఁ గాకున్నన్
దలఁచినతావులనెల్లను, నెలకొని సాన్నిధ్యమొందు నిపుణత గలదే. 78

క. జగతిం జిత్తనిమీలన, మగు నిద్ర యనంగ మూర్ఛ నందుట మోహం
బగు బోధ మెఱుకఁ జెందుట, యగణితస్మృతియత్న మంత మగు నెట్లన్నన్. 79

నిద్ర.—

క. కలనైన శ్రీనృసింహునిఁ, గలయం గల నంచుఁ గలికి కన్నులు మొగిచెం
జెలి బాహ్యేంద్రియపథమున, నలరు మనం బరుగ కుండ నాగినభంగిన్. 80

మోహము.—

క. అతనుశరహతుల సొరిగెను, సతి విరహాతపస్సమాధిజనితవ్రత యై
ధృతి శ్రీనృసింహుఁ దలఁపఁగ, మతి తన్మయ మగుచు మేనుమఱచినభంగిన్. 81

బోధము.—

క. తరణికులాధీశయశ, స్తరుణి జడత్వంబు మాని సంపుల్లసితాం
బురుహాక్షియయి జృంభిత యై, చిరగతి మేల్కానియె శ్రీనృసింహుఁడు గలుగన్.

స్మృతి.—

క. వల పెఱిఁగి రాఁడు కౌఁగిట, నలమఁడు నరసావనీంద్రుఁ డని పగవఁజూమీ
చెలులును జిలుకయు నెవ్వాతి, నల నగునో యనుచుఁ గొంత నగ చెద నాత్మన్.

క. మోద మిష్టలాభభవస, మ్మద మగుఁ గ్రిస్త్యాకౌర్య మందోద్యోగం
బది యలసత సందేహా, భ్యుదయబహుళత్వము వితర్క మొగి నెట్లన్నన్. 84

మదము.—

క. అలులై కింశుకశిఖిలోఁ, జెలఁగుచు మున్నెంతతపముఁ జేసెనొ చెలి నే
నలి నరసింహునియురమునఁ, జెలువగుచెంగల్వదండ చేరువ గలిగెన్. 85

ఆలస్యము.—

క. చెలు లాహారాదులకుం, బిలిచిన నరగంటఁ జూచుఁ బ్రియుఁడు నృసింహుం
డలఘున్నృపకుంజరుం డని, యలినంతల కుంభినీత్వ మందెనొ తానున్. 86

వితర్కము.

క. చెలి తెలుఁగ రాదు భావము, చెలి తెలుఁగకె యున్న పురునిచే రాయిడి యౌఁ
జెలులును మన సాకలైనను, వల పెఱిఁగి నృసింహవిభుఁడు వచ్చునొ రాఁడో. 87

క. అతినిద్ర సుప్తి యితరుల, యతిశయము సహింప కుండు టది యీర్ష్య యగున్
హితవస్తువు చేకూడమి, నతులాధ్యానంబు చింత యగు నెట్లన్నన్. 88

సుప్తి.—

క. లలన నృసింహునికౌఁగిట, నలసియె పవ లెల్ల నిద్ర నందెడి నెలమిన్
నెలపొందున రే ముద్దులు, గులికి పగ ల్నిద్రవోవు కుముదినివోలెన్. 89

అసూయ.—

క. ఈవికొలఁదంతె తనమే, లేవేళను బొందుశోభ యెనరయే నాకున్
వావిరిఁ గీర్త్యంగన యని, శ్రీ వెలయు నృసింహునొద్దఁ జిరతరలీలన్. 90

క. సతి చెక్కిటఁ జెయి సేర్పఁగ, నతులకరాంగుళులు సాంజనాశ్రుయుతములై
రతిపతి బాసట మించిన, శితపంచశరమ్ము లనఁగఁ జెలగు నృసింహా. 91

క. అనయంబుఁ జేతనాచే, తనసదృశమనోభ్రమంబు ధర నున్మాదం
బనఁ బొల్చు ధాతుచలనము, దనర నపస్మార మనఁగఁ దగు నెట్లన్నన్. 92

ఉన్మాదము.—

క. నినుఁ బ్రార్థించెద భ్రమరమ, చని నరసింహేంద్రుఁ దెమ్ము చన వల దోహో
చనిన నృపాలుముఖాంబుజ, ఘనవాసనఁ దగిలి నీవు గ్రమ్మఱవు గదా. 93

అపస్మృతి.—

క. మదనగ్రహంబు సోఁకెను, సుదతీమణి దీర్ఘదృష్టిఁ జూచెడుఁ జెలులున్
ముద మొదవ రక్షఁ గట్టుఁడు, మదవతికి నృసింహనామమంత్రముకతనన్. 94

క. ఇరవగు నీభావంబులు, పరఁగెడు ననుభావములు విభావంబులు న
న్యరసంబులకుం గల వవి, విరచింపఁగ నొల్ల నిందు విస్తరభీతిన్. 95

తే. ఇంక శృంగారచేష్టల నేర్పరంతు, నవియు నష్టాదశాఖ్య [illegible] యలవడుంచు
లలితగతి పేరినామముల్ లక్షణములు, క్రమముతోఁ జెప్పి పిదలక్ష్యము లొనర్తు.

క. ఇల భావహావహేలా, విలాసమాధుర్యధైర్యవిభ్రమలీలా
కిలికించితమోట్టాయిత, లలితాఖ్యలు చేష్టలగుc దలంపcగ మత్తిమున్. 97

తే. వెలయు బిబ్బోకవిచ్ఛిత్తి విహృతిచకిత
హసితకుట్టమితకుతూహలాఖ్య లనcగc
గలవు మఱి యొండు భావంబు వెలయుచుండు
మహా రసజ్ఞానయోగ్యతామాత్ర మగుచు. 98

క. అది యాపద్వ్యక్తియుగా, సుదతులయెడ హావ మయ్యె సువ్యక్తంబై
పొదలిన నసగతింబును, నది మిక్కిలి హేల యయ్యె నది యెట్లన్నన్. 99

భావము.—

చ. ఐరుc డని పేర్కొన న్నిరము వాంఛc దలోదరి సాలభంజికా
పరిణయ వేళ నెచ్చెలులc బాయక యెప్పటియట్ల కేళికాం
తర మొనరింపc బోవు చనెనా యెదc బయ్యెదc జేర్చి సిగ్గునం
బరcగుc బ్రియాంగనానుకృతి భావన కేలికిc గాcగ నిచ్చలున్. 100

హావము.—

ఐ. పడcతి నృసింహుగీతములు పాడెడువేళ నృసింహు నామము
న్నడుపదు సిగ్గుతో గుణజను ల్నరనాథుగుణప్రశంస తే
ర్పడ నొనరించుచో నుచితభక్తిమెయి న్గురు సేవ సేయుకై
వడి వడి నాలకించుc దల వాంచుc బరాకగుc గొంత వింతగన్. 101

హేల.—

ఉ. మేలము లాడుచుం గడు సమేలము లై చెలులెల్లc గూడి యో
బాలిక శ్రీనృసింహనరపాలు వరించెదవే యటన్న నీ
లాలక యంగవల్లిc బులకాంబరము ల్నన లొత్తె నే మనం
జాలక యూరకుండె ననిశంబు త్రపావృత యై [1] నక్కెజిన్. 102

క. పతిc గనc దాత్కాలిక మగు, నతులవికారము విలాస మగు సొమ్ములు తే
కతిరమ్యత్వము దలcపcగ, నతిసలమ న్మధురభావ మగు నెట్లన్నన్. 103

విలాసము.—

క. ఇరుగడల వెడలి సుడిగొని, తరళము లై వెలికి జెళికి తళతళ మచుచున్
బరcగును దారపుcజూపుల, హరిణాక్షి నృసింహవిభుని హారతి సేసెన్. 104

---

1 చెలంగుచున్.

మాధుర్యము.—

చ. కనుఁగవకెంపు సార్ద్రనఖగౌరతయుం జెలువొందు నొక్కు లుం
గనరతివేగశీర్ణమణికంకణనూపురహారవల్లి యై
మునుపటికన్నఁ బొల్పుగ సముజ్జ్వలతం దగెఁ బాండుపత్త్రయై
కొనల సిగిర్చి యున్న యతికోమలవల్లి మతల్లియో యనన్. 105

క. కులశీలాద్యవిలంఘన, మిల ధైర్యం బాడలఁ దొడవు లిడఁ దడఁబడినన్
వెలయఁగ విభ్రమ మధిపుని, యలఘుగుణానుకృతి లీల యగు నెట్లన్నన్. 106

ధైర్యము.—

మ. అతులైశ్వర్యసమగ్రుఁ డైననరసింహాధీశ్వరుం డేడ నీ
పితృవాచాపరతంత్రతైకతపతం బెంపొందు నేనేడ నా
క్షితిపాలాగ్రణిపైఁ బ్రసక్తముగ నా చిత్తంబు సంధించినాఁ
డతనుం డక్కట నేఁటనుండి విషమాస్త్రాభిఖ్యుఁడౌ నెంతయున్. 107

విభ్రమము.—

చ. అదన నృసింహభూమిరమణాగ్రణి వచ్చినసంభ్రమంబుతో
సుదతి నభోవిలగ్నమునఁ జొక్కల పేరిటికంఠమాలయుం
బొదలుకుచాచలంబుల సముజ్జ్వలమేఖలయున్ ధరింపఁగా
నది క్రమ మయ్యెఁ దొయ్యలికి నక్రమ మయ్యె విలాసవైఖరిన్. 108

లీల.—

చ. ధర నకలంకభావమునఁ దామరసాహితునిన్ జయించు నా
హరిపదసక్తయై వెలుఁగు నారయఁ బ్రాజ్ఞులకున్ వసుంధరా
సురతరునూతనాభ్యుదయశోభ యొనర్చు యశఃపురంధ్రి యా
వరుఁ డగు శ్రీనృసింహుగుణవాసనఁ దానుఁ జెలంగు నైవడిన్. 109

క. అలుకలుక ముదము నశ్రువు, గలిసినఁ గిలికించితంబు గడు నిష్టకథా
దుల నింగిత మెఱిఁగించుట, దలఁపఁగ మొట్టాయితంబు దగు నెట్లన్నన్. 110

కిలికించితము.—

చ. పతి రచితాగసుం డదరిపాటున వచ్చి దృఢోపగూహన
స్థితి నధరప్రవాళము గ్రసింప ససంభ్రమలోలహస్తయై
మతకరి చాలుఁ జాలు నిఁక మానెను రాకు మటంచు నల్కతో
నతివ బొమల్ ముడించె నయనాంబువు లొప్పల నప్పళించుచున్. 111

మొట్టాయితము.—

చ. చెలులు నృసింహుగీతమును జేరిక గా నపరంజివీణెలోఁ
పలుకఁ బలికింప నూర్చుచును బాలిక యూర్పులచేత దీపికా
కలిక చలింప నెచ్చెలులు గంటిరె మామృదుగానలక్ష్మికిం
దెలియఁగ మెచ్చుచున్నయది దీవియ యంచు హసించు నంతయున్. 112

క. భాసురతమవల్లివి, న్యాసము లలితమ్ము సొమ్ము లల్పము లయ్యున్
భాసిల్లెడుశృంగారవి, కాసము విచ్ఛిత్తి యయ్యెఁ గన నెట్లన్నన్. 113

లలితము.—

చ. పడియు క్రమంబుతోడిభుజవల్లి మృదంగముమీఁదఁ జేర్చి కే
లెడలిననూపురంబు ఘటియింపఁగ దూతికరారవిందమం
దడుగిడి కంపితస్తనరయంబున నూర్పురదోఁప నింతి య
య్యెడ నటియించి నిల్చె సభ యెల్ల ననంగునిపాలు సేయుచున్. 114

విచ్ఛిత్తి.—

చ. పరిమితభూషణంబులును ఫాలముపై నెలవంక నామమున్
బరఁగ నొయారి యై నయనపర్వ మొనర్చె వధూలలామ తా
విరళగణేయతారలు నవీనత రేందుకలావిలాసము
న్వరుస వెలుంగఁగా విదియనాఁటివిభావరి వోల్పు కైవడిన్. 115

క. వరునికథయుం దనాదర, మరయఁగ బిబ్బోక మయ్యె ననుమతిఁ బలుకం
దర మగు తగువేళల ను, త్తర మొసఁగమి విహృత మనఁగఁ దగు నెట్లన్నన్. 116

బిబ్బోకము.—

చ. అతఁడు గుణాభిరాముఁ డతఁ డంగజసన్నిభుఁ డంచు నెచ్చెలు
ల్పతి యగు శ్రీనృసింహనరపాలు నుతింప లతాంగి నీటుతో
శ్రుతులఁ గరాంగుళుల్సొనిపె శోభనతచ్చరితాభిపూర్ణ మై
యతిశయ మంగు కర్ణయుగమం దవకాశ మొనర్చు కైవడిన్. 117

విహృతము.—

ఉ. బాలిక యల్కతో మరలి పల్కక యుండియుఁ బ్రాణనాథుఁ డ
వ్వేళ తుతం బొనర్పఁ గడువేగ చిరాయు వటంచుఁ బల్కఁగాఁ
జాలక రోషముం బ్రణయసంభ్రమము న్మది దొమ్ములాడ నీ
లాలకకుండలద్వయ నుదగ్రగతిన్ ఘటియించె వీనులన్. 118

క. అలుకుట చకితము నవ్వుచు, నలుగుట హసితంబు రతుల నతిసమ్మర్దో
జ్జ్వలసౌఖ్యము కుట్టమితము, లలనకుఁ జపలత కుతూహలం బెట్లన్నన్. 119

చకితము.—

చ. అడుగిడి నిల్చినిల్చి చెలి కౌనలు వెట్టు నదల్చు సిగ్గునం
దడఁబడుఁ గాంతుఁ డున్నమణిధామ మొగిం జొరఁ జాల కెంతయు
న్వడఁకు గృహంబు సొచ్చియుఁ గవాటము దాపున నిల్చు నెచ్చెలు
ల్వడిఁ జనఁ జూచినం బెనఁగు వారిజలోచన మౌగ్ధ్యసంపదన్. 120

హసితము.—

చ. వదనసరోజవాసనకు వచ్చిన తేఁటి నదల్చి చూడఁగా
నది యసితోత్పలంబు లని యక్షుల వ్రాలఁగఁ జే విదుర్పఁగా
నది మరలం బయోజ మని హస్తయుగంబున వ్రాలె నవ్వె న
మ్మదవతి యేమి సేసినను మాన దిదేమి యటంచు నెంతయున్. 121

చ. కెరలి ప్రియుండు మోవిపయిఁ గెంపులు నింపుటఁ బారవశ్యత
త్వరత నెఱుంగ లేక పిదప న్నిలువద్దము చూచి సిగ్గునం
దరుణి చెలుల్గనుంగొనినఁ దా రిఁక నే మని యాడుకొందురో
పరుని నటంచుఁ జిల్కకు నవారణ ముద్దులు వెట్టు సారెకున్. 122

కుతూహలము.—

చ. కలికి నృసింహభూవిభునిఁ గాంచి నవప్రణయాభిరాము డై
కలితకరాబ్జకేళికమలంబు భ్రమింపఁగఁ జేసె విభ్రమం
బలవడఁ బ్రాణనాథ హృదయాబ్జము ని న్నెడఁబాయ లేక యి
ట్లెలమి భ్రమించుచున్న దని యేర్పడఁ జెప్పెడిచంద మందఁగన్. 123

తే. మఱియు శృంగార మంగనామణులయందు, నంకురితపల్లవితపుష్పితాదిభేద
వర్ణితాకృతి యై దశావస్థ[1] లయ్యె, వీనినామక్రమంబులు విస్తరింతు. 124

క. ఇలఁ జూచుట చింతించుట, తలఁచుట గుణవినుతి యరతి తాపము లజ్జా
స్ఖలనము గమనము మూర్ఛయు, నల ధన్యత యన నవస్థ లగు నెట్లన్నన్. 125

చక్షుఃప్రీతి.—

మ. అనురాగాంబుధి యుబ్బి వెల్వడినయ ట్లాపూర్ణఘూర్ణాంబువుల్
దనువల్లిం డిగజాఱఁ గన్నుఁగవ లేఁదబ్బ ల్విసాళించుచున్
ననవిల్కానిపురప్రవేశకలనానాళీకదామంబు లై
తనరం గోమలి నిన్నుఁ జూచె నరసేంద్రా సాంద్రతేజోనిధీ. 126

చింత.—

మ. అరవిందంబు విలాసమందిరము నీహారాంశుఁ డేకోదరుం
డరయ న్గోత్రవిరోధ మేటికి వనర్థం బంచు నూహించి యి

1 మయ్యె.

ర్వారఁ బొందించుపయోధికన్యక్రియఁ జేర్పుం గేలు గండస్థలిం
దరుణీరత్నము చింతచేత నరసేంద్రా సాంద్రతేజోనిధీ.

సంస్మృతి.—

మ. నరభూపాళులపై మనం బిడక దృగ్వ్యాపార మెంతేఁ బర
స్పరసందర్శననాతిభిన్న మయి చూపట్టంగఁ గార్యాంతర
స్మరణం బేమియు లేక నిశ్చలత నీసాంగత్యముం గోరి మా
హరిణీలోచన యాత్మయందు నరసేంద్రా నిన్ను భావించెరా.

గుణకీర్తనము.—

మ. పలుకుం దోడగువీణలోఁ జెలియ నీపై గీతము ల్మీటఁ దొ
య్యలిమైనీడ మెఱుంగుఁగాయ నిరవై యవ్వీణలో వాణియో
లలితాంగీ మనచిత్తముం బ్రియుఁడు కొల్లల్వాపెఁగా యంచు వె
ల్పలికిం దాను బుసాడ వచ్చె ననఁ గన్పట్టు న్నృసింహాధిపా.

అరతి.—

మ. నిరతం బాత్మకరాంఘ్రిబాహునఖకాంతిస్ఫూర్తికిం దిగ్గనై
శరణం బొందు ప్రవాళపద్మబిసపుష్పశ్రేణికిం గ్రమ్మఱన్
శరణం బందుట హీన మంచునో మదిన్ శైత్యోపచారక్రియా
గరిమం బొల్లదు మానినీమణి కడంకన్ శ్రీనృసింహాధిపా.

తాపము.—

మ. ధవళాక్షీమణిమేను హేమలతయ న్తత్త్వంబు మున్నెల్లఁ ద
త్కవిలోకోక్తియటంచు నుంటి నది తథ్యం బయ్యె నెట్లన్న భ
వ్యవియోగానలతప్తమై నిబిడబాష్పాసిక్తమై డస్సియు
న్నవశోభాతిశయంబుఁ జెందె నరసేంద్రా సాంద్రతేజోనిధీ.

లజ్జాత్యాగము.—

మ. చెలి నీమూర్తి లిఖించి చిత్రఫలకం జెన్నొందుబాష్పాంబుపి
చ్ఛిల మాపయ్యెదమీఁదఁ జేర్చుకొన నాచిత్రం బలక్ష్యంబుగా
బళిరే కట్టినచీరయుం బగయు కాఁ బాటించె దైవం బటం
చలినీలాలక యార్తిఁ జెందు నరసింహా యింకఁ బాలింపుమీ.

గమనము.—

మ. చెలుల న్వంచనచేసి యొక్కతయ తాఁ జెన్నొంద నీయొద్దకు
న్నలినాక్షీమణి రాఁ దలంచి నవరత్నప్రోతసౌధాంగణ

స్థలుల న్స్వే న్నని వచ్చునిర్మలతనుచ్ఛాయ న్నిరీక్షించి నె
చ్చెలి యేతెంచె నెఱుఁగఁ బోలు నని నిల్చెన్ శ్రీనృసింహాధిపా. 133

మూర్ఛ.—

మ. బలితం బైనయనంగ వేదనలచేఁ బల్మాఱు నిట్టూర్పు లే
కలికిలీలాలకప్రాణము ల్వెడలి నేత్రాంభోజమార్గంబునం
గలయం బ్రాఁకుచు వచ్చి యన్నెలవునం గన్నీటియే అడ్డ మై
నిలుప న్నిల్చె నృసింహభూరమణ మన్నింపఁగఁ బా డింతేటన్. 134

ధన్యత.—

మ. శుకవర్గం బొకపాటలో మెలఁగె నానూనాయుధుం డాంతరం
గికుఁ డై యుండె మరాళి మొక్కనడకం గ్రేష్టుబ్బి వర్తించెఁ బా
యక వేడ్క న్సుముఖత్వ మొందె కళి మాయబ్జాక్షి సేమంబుతో
సకలంకస్థితి నీవు గూడ నరసింహా రాజకంఠీరవా. 135

తే. తెలియ శృంగారమిదియును ద్వివిధ మగుచుఁ
బరఁగు సంభోగవిప్రలంభంబు లనఁగ
నందు బహుభేదముల నగణ్యంబు గాక
యేకవిధ మయ్యె సంభోగ మెట్లటన్న. 136

సంభోగము.—

మ. మరుఁ డాచార్యుఁడు గా విశీర్ణకబరీమాల్యాళి పుష్పాంజలి
స్ఫురణ ల్గాఁ దముపేతభృంగనినదస్తోమంబు గానంబు గా
వరమంజీరరవంబు తాళగతి గా నర్తిల్లుశాతోదరీ
సురతవ్యత్యయవేగతాండవ మొనర్చుం జింతితాభీష్టముల్. 137

క. పురుషులకుఁ దలోదరులకు, నరయంగా విప్రలంభ మభిలాషేర్ష్యా
విరహప్రవాసకారణ, పరిణతిచే నాల్గుగతులఁ బరఁగుచు నుండున్. 138

క. కలయుటకు మున్ను కోరిక, యిల నభిలాషంబు మాన మీర్ష్య విరహ మాఁ
గలసి యెడఁబాయు హృదయో, త్కలిక ప్రవాసము విదేశగతి యెట్లన్నన్. 139

అభిలాషము.—

చ. అనయము శ్రీనృసింహులలితాంకతలంబున నుండ వచ్చునా
యనఘునఖాంకసంగతుల నందఁగ వచ్చు నృపాలమౌళితోఁ
జనువునఁ గుల్కవచ్చు గుణసంగతి మెచ్చులు చూప వచ్చునో
వనజదళాక్షి యాకనకవల్లిక నైనను ధన్య నౌదు గా. 140

ఈర్ష్య.—

మ. వదనాగ్రంబున వాణి యున్నది మము న్వాక్ప్రౌఢ నీ దిందిరా
మదిరాక్షీమణి యున్నదక్షుల మము న్మన్నించి వీక్షింప నీ
దదియుం గాక నృసింహ నీవిపులబాహాశ్లేష మే నొంద నో
ర్వదు భూదేవి బహుప్రియారత నినుం బ్రార్థింప నిం కేటికిన్. 141

విరహము.—

ఉ. నెచ్చెలు లీనృసింహధరణీవరుఁ డెచ్చెద మంచుఁ బోయి రా
రిచ్చట నీవునుం గరుణ యించుక లే కలరంపగుంపులం
గ్రుచ్చెద వేల మత్ప్రియునిఁ గూర్పుము మన్మథ నీకుఁ దద్విభుం
డెచ్చటికైన యొసంగెద మదీయకటాక్షము లన్జయాస్త్రముల్. 142

ప్రవాసము.—

చ. చిరయశ యోబభూవరనృసింహ ఘనద్రిపుకాంత కాననాం
తరమున కేఁగి యందు నిజనాథునిఁ గానక మన్మథార్తయై
వరుని సరోజపత్త్రమున వ్రాయునెడం గరము ల్సెమర్పఁ గా
నరయ నిజాంగకంబె పగ యయ్యె నటంచుఁ దలంచు దైవమున్. 143

క. పలువురకొకభామినిపైఁ, దలఁపును నొకవారసతికిఁ దగఁ బలువురపై
వలపును మృగవిహగాదుల, కెలవు రసాభాస మయ్యె క్షితి నెట్లన్నన్. 144

రసాభాసము.—

చ. అలఘువిశీర్ణపక్షయుగమై యమితోన్నమితోర్ధ్వకాయమై
గళరవము ల్దలిర్పఁ బ్రియకాంతకు ముద్దులు వెట్టి యుబ్బునం
బలుమఱు మేడపై కెగసి పక్షము ద్రిప్పుచుఁ గుంచితాస్యమై
పాలఁతుకఁ బిల్చువిభ్రమకపోతము హుంకృతనాదమాధురిన్. 145

క. భావింప భావశాంతియు, భావోదయభావసంధిభావశబలతల్
భావం బడఁగుట పుట్టుట, ద్వైవిధ్యము బహుత యనఁగఁ దగు నెట్లన్నన్. 146

భావశాంతి.—

చ. తలఁపఁగ రాజశేఖరుఁ డతండు తలోదరి సర్వమంగళా
కలితవు నీవు మీర లొకగాత్రముకై పడిఁ గూడి మాడుచుం
జెలఁగుట యొప్పఁ గా కలుగఁ జెల్లునె మీ కని బోటి మ్రొక్కఁగా
లలనకుఁ దోఁచె బాష్పసలిలంబు నివారితమానపంకమై. 147

భావోదయము.—

ఉ. మేలము లాడువేళల సమేలము లై చెలు లెల్లఁ గూడి యో
బాలిక శ్రీనృసింహనరపాలు వరించెద వే యటన్న నీ

లాలకయంగవల్లిఁ బులకాంకురము ల్మనలొత్త నే మనం
జాలక యూరకుండె ననిశంబు 1 వినమ్రముఖాంబుజాత యై. 148

భావసంధి.—

మ. హరి కానంగ శరాళి యై యరికవేలాభీలదివ్యాశుగో
త్కర మై శౌరకిఁ బాటలాబ్జకలికాదామంబు లై వైరి కి
న్నిరతాగ్నిప్రభ లై వెలుంగునరకానీకాధికోల్లాసభా
సురసత్యారమణీకటాక్షములు ప్రోచుం గా శ్రీనృసింహాధిపున్. 149

భావశబలత.—

మ. చెలు లేమందురొ భావవీథి నకటా శ్రీనారసింహేంద్రుకౌఁ
గిలి నాకెన్నఁడు గల్గునో నృపతితోఁ గ్రీడింపఁగాఁ బోవుచం
చలపుంజిత్తము నేమి సేయుదు గురు న్సద్భక్తిఁ బ్రార్థింతునో
యల ప్రాణేశ్వరుఁ జూడ కున్నఁ బరితాపాటోపము ల్మాను నే. 150

నవరససంకరము.—

మ. జయలక్ష్మీరతి మై ప్రతాపయుత మై శత్రుచ్ఛిదాధుర్య మై
ప్రయతార్తావన మై కపీంద్రగతి యై రక్తార్ద్రి మై నిర్ఘృ ణో
దయవిద్యున్నిభ మై సకంప మయి వందారుస్పృహాశూన్య మై
నయ మొప్ప న్నరసింహుఖడ్గ మమరు న్నానారసప్రక్రియన్. 151

రసాధిదేవతలు.—

సీ. హరికి శృంగారలీలాధిపత్య మొనర్చు, గణనాథు హాస్యసంగతునిఁ జేయు
నలికలోచనునిపై నధికరౌద్రము నిల్పు, శక్రుపై వీరరసంబు నెఱపు
యమునిపై2ని దయామయత్వంబు ఘటియించు, జగతి నుహాకాలు సభయుఁ జేయు
శర్వరీంద్రుని జుగుప్సారసాన్వితుఁ జేయు, శతధృతి నద్భుతాన్వితు నొనర్చు
తే. శాంతి బ్రహ్మంబు జేర్చు నిచ్చలు నృసింహు
భువనభరణంబు వరవిఘ్ననివహహరణ
మీశతయు భోగము ననేకనృపతిహృతియు
ననియు యశమును మతియు బోధాతిశయము. 152

సీ. మరకతానీకదంభమున శృంగారంబు, హాస్యంబు ముక్తాఫలౌఘరుచులఁ
గరుణ3విద్రుమపద్మగౌరపక్ష్మలమున, రౌద్రంబు కురువిందగత్నకలన

1 త్రపావృత యైనదైపడిఁ. 2 శ్లోకము. 3 విద్రుమంబు.

వీరంబు గోమేధికారోపితస్ఫూర్తి, భయము వైదూర్యశోభామిషమున
భీభత్స మింద్రనీలాభాగుణంబున, శాంతి నిర్మలహీరకాంతిగతుల

తే. నద్భుతము పుష్యరాగరాగాపదేశ, విలసితంబున సాకారవృత్తిఁ గాంచి
నవరసంబులు వొల్చు నీభవనవీథిఁ, బ్రబల సుబలన్నసింహ యోబయ్యన్నసింహ.

క. 1 కరుణాభయబీభత్సము, లురసంబులు శోకభీతిగాఢజుగుప్సా
కరములుగా నరసము లై, తిర మగు నెట్లన్న దీనిఁ దెలిపెద వరుసన్. 154

ఉ. భావ మలంక్రియాగుణవిభాసిత మై వికసద్రసోదయ
శ్రీవినివారితేతరవిశేషనివేదన మై యెలర్వ నీ
వావిరి దుఃఖ మైన సుఖవైభవ మైన విటీవిటాలియం
దావలఁ బూర్ణమై సహృదయాత్మలఁ గేవలహర్ష మై తగున్. 155

తే. అలపదార్థంబు లగువిభావానుభావ, సాత్త్వికాదులఁ గూడి రసత్వ మొందు
నవనిభావంబు వాక్యార్థ మనఁగ నెగడి, తంతువులుగూడి పట మనఁ దనరుకరణి.

మ. రమణీయోల్బణతాసమేత మగు నీరత్యాదిభావాబ్ధిలో
నమరం బుట్టుచు మున్గుచుం దగుఁ దరంగారూఢి సంచారిసం
ఘము లేతత్ప్రతిపన్న మారసము తత్కాలంబునం దైన స
త్యము రామాచులయంద నాట్యమున సభ్యావాస మై భాసిలున్. 157

శా. లేఖేశప్రతిమానవైభవ భవాశ్లిష్టస్రవంతీమరు
చ్ఛాఖిస్పర్ధియశఃపరంపరపరక్ష్మాపాలకప్రాజ్యరా
జ్యాఖర్వస్మయపుంజసంజనకృపాణాకల్పకల్పాంతవే
లాఖేలత్ప్రబలార్కకర్కశమహాలంఘుప్రతాపోదయా. 158

అచలజిహ్వము.—

క. భోగాంబువాహవాహవి, భాగేహాభావుకాఁగభావభవమహా
భాగమహీభాగమహా, భోగావహబాహుభోగిపుంగవభోగా. 159

కవిరాజవిరాజితము.

నిరుపమరూప దిలీపమనూపమనీతికలాపకలాపధర
స్మరణభవానుభవానిశమానితమానసపద్మసపద్మరట
త్కరివరఘోటకకోటికరంభితకాంతనిశాంతనిశాంతమహా
హరిహయదిక్తరణిస్ఫురదైకవిభాధికలాభకలాభవనా. 160

1 కరుణభయానకభీభ, త్సరసంబులు శోకభీతి సారజుగుప్సా.

గద్యము. ఇది శ్రీహనుమత్ప్రసాదలబ్ధ కవితాసారసారస్వతాలంకార నిరంకుశ ప్రతిభాబంధుర ప్రబంధపరనరచనాధురంధర ప్రబంధాంక వేంకటరాయభూషణ సుపుత్త్ర తిమ్మరాజపౌత్త్ర సకలభాషావిశేష నిరుపమానధాన శారదామూర్తిమూర్తి ప్రణీతంబైన కావ్యాలంకారసంగ్రహంబను మహాప్రబంధంబునందు రసస్థాయి సామాన్యలక్షణంబును దద్బహూకరణంబును విభావానుభావ సంచారిభావప్రపంచంబును శృంగారచేష్టాప్రకరణంబును నవస్థానిర్ణయంబును సంభోగ విప్రలంభభేదంబును రసాభాసభావశాంతిభావోదయభావసంధిభావశబలతాసంకరతలును రసవర్ణాధిదేవతావిశేషంబును నన్నది తృతీయాశ్వాసము.

శ్రీ ర స్తు.

# న ర స భూ పా లీ య ము

## కావ్యాలంకారసంగ్రహము - చతుర్థాశ్వాసము.

---



క. శ్రీకరగభీరగుణర
త్నాకరకటకాధిరాజహాయపతిసేనా
భీకరభుజప్రతాప
స్వీకృతజయసాంద్ర నారసింహనరేంద్రా. 1

తే. అవధరింపుము దోషంబులను వచింతు, నవియు శబ్దార్థగతము లై ద్వివిధము లగు నందుఁ బదవాక్యగతము లౌ నరయ శబ్ద, దోషములు వీనిలోఁ బదదోషతతులు.

సీ. అప్రయుక్తం బపుష్టార్థంబు నేయార్థ, మసమర్థకంబు నిరర్థకంబు
గ్రామ్యంబు విగతసంస్కారంబు గూఢార్థ, మన్యార్థ మశ్లీల మప్రతీత
మప్రయోజనము క్లిష్టార్థబంధంబు సం, దిగ్ధంబు విపరీతధీప్రదాయి
యవిమృష్టతరవిధేయాంశంబు పరుషంబు, ననఁగఁ గావ్యంబులం దరసి చూడ

తే. పదగతంబులు వెలయుసప్తదశసంఖ్య, గడలుకొన వీనిలక్ష్యలక్షణము లెల్ల
విస్తరించెదఁ గవితాప్రవీణసుకవి, నివహానిరతోపకారనిర్నిద్రఫణితి. 3

క. ఈకవితాదోషోత్కర, మేకడ నీ వొసఁగుమాడ్కి నియ్యక ఖలు లౌ
నాకులకులదాతలకు మ, హాకుకవు లానర్చుకృతులయందు వసించున్. 4

అప్రయుక్తము.—

క. కవులు ప్రయోగింపనిపద, మవనిం దగ నప్రయుక్త మగు నెట్లన్నన్
ద్రవిణాలబిలుం డల దు, శ్చ్యవనమహాభోగిఖేటసంస్తుతుఁ డనఁగన్. 5

అపుష్టార్థము.—

క. ఎనయఁ బ్రకృతోపయోగం, బునుఁ జెందక యున్నపద మపుష్టార్థం బౌఁ
దుని మెను వింశత్యర్థా, ననువింశత్యర్థరథునినందనుఁ డనఁగన్. 6

నేయార్థము.—

క. ఇలఁ దనసంకేతంబున, నిలిపినపద మెంచి చూడ నేయార్థం బౌ
బలు తేనెదిండిగమి నగు, నలసాగరకర్ణయాన యలక లనంగన్. 7

అసమర్థము.—

క. ధర నప్రసిద్ధయోగం, బరసి ప్రయోగించుపదమ యసమర్థం బౌ
శరధరరాజనికేతను, గురుపంకజచక్రహస్తుఁ గొలుతు న టన్నన్. 8

నిరర్థకము.—

క. ఇలఁ బదపూరణమాత్రం, బలవడినపదంబు కృతి నిరర్థక మయ్యెన్
దలఁపఁగ వెలయుచు లలి ను, జ్జ్వల మగునీతనివిలాససౌష్ఠవ మనఁగన్. 9

గ్రామ్యము.—

క. పామరులభాష గ్రామ్యము, భామినికటిగల్లములు విభాసిల్లు నన న్
గోమలిచన్నులుగన్నులు, గామునిపండువు లొనర్చెఁ గడువడి ననఁగన్. 10

చ్యుతసంస్కారము.—

క. వ్యాకరణదుష్ట మగుపద, మేకడఁ జ్యుతసంస్కృతాఖ్యమిది యె ట్లన్నన్
శ్రీకమలకాంతపదసే, వాకర్తుఁ డనఁగఁ గరుణావారిధి యనఁగన్. 11

గూఢార్థము, అన్యార్థము.—

క. కృతి నఖ్యాతము గూఢం, బతిశయరూఢివ్యపేత మన్యార్థం బై
క్షితిఁ దగుశోణితనయునుం, డితఁ డనఁగ సమానుఁ డితఁ డహిధ్వజుఁ డనఁగన్.

అశ్లీలము.—

క. వ్రీడ జుగుప్సా మంగళ, శీలము లగుపదము లొకటఁ జేర్చిన నవి య
శ్లీలము లగుఁ గృతి నేత, న్మాలము లగు త్రివిధభేదముల నెఱిఁగింతున్. 13

క. వసుదేవయోనిగోప్పీ, విసరమహాపీనకుచనవీనాశ్లేషో
ల్లసితుం డనఁ గాళిందీ, రసవిహరణకరణనిత్యరసికుం డనఁగన్. 14

అప్రతీతము.—

క. అల శాస్త్రపురాణములనె, కలశబ్దం బప్రతీతకం బగుఁ గృతులం
దలఁతు వృషాకపిఁ ద్రిజగము, నెలమి నజావృతముఁ జేయు నీశ్వరు ననఁగన్. 15

అప్రయోజనము.—

క. అవిశేషవిధాయక మై, కవిసినపద మప్రయోజకము భూతివిభా
ధవళితహారసుతుఁ గొలుతును, నవనలినహారద్విపాస్య నయముగ ననఁగన్. 16

క్లిష్టము.—

క. దూరార్థము క్లిష్టం బగు, ధారుణిఁ బవనాశనేంద్రధరమకుటాలం
కారమణిజనకవరపు, త్రీరమణకుమారరూపదీపితుఁ డనఁగన్. 17

సందిగ్ధము.—

క. సందిగ్ధ మనఁగఁ జెలఁగును, సందేహాస్పదపదంబు సమరధరిత్రీ
సందీపితజయశాలిపు, రందరనుతవిక్రముండు రాముఁ డనంగన్. 18

విపరీతధీప్రదము.—

క. జగతి న్విరుద్ధ మతికర, మగునది విపరీతధీప్రదాఖ్యం బనఁగాఁ
దగుఁ గృతు లన కులహీనుం, డగు నితఁ డన నంబికావిటాసక్తుఁడనన్. 19

అవిమృష్టవిధేయము.—

క. అవిమృష్టవిధేయం బగుఁ, దవిలినవర్ణ్యాంశ మప్రధానం బైనన్
నవనవసంఫుల్లలతాం, తవసంతము వచ్చె నిపుడు ధరణి కనంగన్. 20

పరుషము.—

క. శ్రుతికటువు లైనపదములు, కృతిఁ బరుషము లనఁగఁ జెలఁగు నిలఁ గుధ్రోజ్జా
పతిమూర్ధధృతార్ధోడ్వధి, పతి గొల్తు నభీష్టసిద్ధి ఫలమున కనఁగన్. 21

వాక్యదోషములు.—

సీ. అక్రంబు విసంధి ప్రక్రమభంగంబు, పునరుక్తియుతమసంపూర్ణతరము
వాక్యసంకీర్ణంబు వ్యాకీర్ణ మధికప, దంబు వాచ్యవివర్జితం బరీతి
న్యూనోపమంబు బధికోపమంబు సమాప్త, పునరాత్తమస్థానఘునసమాస
మనియతచ్ఛందంబు యతిభంగ ముపతత్ప్ర, కర్షంబు భిన్నలింగంబు భిన్న
తే. వచన మక్రియసంబంధవర్జితములు, వాక్యగర్భితమును నన వాక్యదోష
వితతు లిరువదిరెండయి వినుతిఁ గాంచు, వీనిలక్షణలక్ష్యము ల్విస్తరింతు. 22

అక్రమము.—

క. క్రమహీన మక్రమం బగు, సమధిక మగు నితనికీర్తి శౌర్యచ్ఛాయా
సముదయమునకున్ దినకర, హిమకరకిరణోత్కరంబు లెనయే యనఁగన్. 23

విసంధి.—

క. అపగతలక్షణమును గ్రా, మ్యపుసంధియుఁ దగ విసంధి యనఁ దగు నరిగె
న్నపరగిరి కినుఁ డనంగా, నృపు లొప్పుదు రధికగుణవినిద్రతనంగన్. 24

ప్రక్రమభంగము.—

ఆ. ప్రక్రమంబు విడువఁ బ్రక్రమభంగంబు, శౌరి దానవారిఁ జక్రధారి
నభవు నమితవిభవు ననవద్యచారిత్రు, విష్ణుఁ గొల్తు జిష్ణుఁ గృష్ణు ననఁగ. 25

పునరుక్తియుతము.—

క. ఎనయఁగ శబ్దార్థంబులు, పునరుక్తము లైన నదియె పునరుక్తియుతం
బనఁ దగుఁ జక్రాంచలమున, దనుజావళిఁ ద్రుంచు జక్రధరుఁ డితఁ డనఁగన్. 26

అపూర్ణము.—

క. ధరలోఁ గ్రియాన్వయంబుల, సరిపోనిదపూర్ణ మనఁగ సన్నుతి కెక్కెన్
నరపతి యొసఁగును ద్రవ్యము, పరఁగఁగ నౌదార్యశాలి బహుళము ననఁగన్. 27

వాక్యసంకీర్ణము.—

క. ఏకడ వాక్యాంతరితప, దాకీర్ణము వాక్యకీర్ణ మగుఁ బొగడుదు రీ
భూకాంతుఁడు జను లెల్ల న, నేకగుణాన్వితుఁ డటంచు నిలలో ననఁగన్. 28

వ్యాకీర్ణము.—

క. భ్రాంతికరం బగు నన్వయ, మెంతయు వ్యాకీర్ణ మయ్యె నిదుఁడు తిలకముం
గుంతనములఁ గాంతకును ల, తాంతంబులు నెరవుఁ డిప్పు డనంగన లనఁగన్. 29

అధికపదము.—

క. తలఁపఁగ మిక్కిలిపదములు, గలిసినయది యధికపదము కమలారికలా
కలితవిలాసనముల్లస, దలఘుయశోవిభవశాలి యగు నితఁ డనఁగన్. 30

వాచ్యవివర్జితము.—

ఆ. వాచ్య ముజ్జగింప వాచ్యవివర్జితం, బనఁగ నెగడు నాజి నభవుఁ డైనఁ
దెగడు నితనిబాహుందీప్తాసి యనునెడ, నాజి నభవుఁ దెగడు ననుచుఁ బలుక. 31

అరీతి.—

క. రసమున కనుచితమగుపద, విసర మరీతి యనఁ బొల్చు విటజనహృదయ
గ్రసనాగ్రహాగ్రహిళదృ, ష్టిసముగ్రోదగ్ర మతివశృంగార మనన్. 32

న్యూనోపమము, అధికోపమము.—

తే. ఉపమ చాల కున్న న్యూనోపమం బధి, కోపమాఖ్య మధిక ముపమ యైన
హైమవసనుఁ డైన హరిమేఘనిభుఁ డన, నతివ పల్లవితలతాభ యనఁగ. 33

సమాప్తపునరాత్తము.—

క. క్రమ ముడిగి మగుడఁ బూనిన, సమాప్తపునరాత్త మయ్యె శాశ్వతు నభవుం
గమలాక్షుఁ గమలనాభుం, గమలాపతిఁ గొల్తు ముక్తికై విభు ననఁగన్. 34

అస్థానసమాసము.—

క. అపదసమాసం బస్థా, నపటుసమాసంబు రిపుల ననిఁ దునిమెద నే
నిపు డని వికటభ్రుకుటీ, విపులక్రోధాంధుఁ డయ్యె వీరుం డనఁగన్. 35

ఛందోభంగము, యతిభంగము.—

క. ఛందము యతియుం దప్పిన, ఛందోయతిభంగము లగుసంగతి నితఁడుకా
కుందేందువిశదయశుఁ డై, ముందుగఁ బూజించినాఁడు నరహరి ననఁగన్. 36

పతత్ప్రకర్షము.—

క. క్షితి నుత్కర్షము దక్కినఁ, బతత్ప్రకర్షంబు గవయ భల్లూకమృగీ
వితతివిభేదనగర్వా, యతసింహాభీల మీమహాటవి యనఁగన్. 37

భిన్నలింగము, భిన్నవచనము.—

ఆ. ఉవిదఁ బురుషుఁ బోల్ప నొకనిఁ బల్వురఁ బోల్ప, భిన్నలింగమనఁగభిన్నవచన
మనఁగఁ జెలఁగు నింతివనజారివలె నన, ఖడ్గ మురగవరులకరణి ననఁగ. 39

అక్రియము లేక అశరీరము.—

క. తుదలఁ గ్రియాశూన్యము లగు, పదంబు లశరీర మనఁగఁ బరఁగు న్విభవా
స్పద మగుమధుమాసంబునఁ, బొదలు తరూత్కరము కుసుమపూర్ణం బనఁగన్.

సంబంధవర్జితము.—

క. సంబంధవర్జితం బగు, సంబంధము విడువఁ గరులు శైలములు తురం
గంబులు భంగంబులు సమ, రాంబుధివరతరణి యిభనియసిలత యనఁగన్. 40

వాక్యగర్భితము.—

క. నడుమ నొకవాక్యపద్ధతి, తొడరిన నది వాక్యగర్భదోషము ఖలు లా
వెడమతులతోడిసంగతి, కడుహిత మిది నీ కొనర్పఁగా వల దనఁగన్. 41

అర్థదోషములు.—

క. క్రమమున నిఁక నర్థజదో, షముల నెఱింగింతు సుకవిజనులకు హీనో
పమ మధికోపమ మసమో, పమ మఖ్యాతోపమంబు పరుషము మఱియున్. 42

తే. వ్యర్థ మేకార్థము ససంశయం బపక్ర, మము విరుద్ధంబు విరసాతిమాత్రహేతు
రహితనిరలంకృతాశ్లీలసహచరచ్యు, తములు భిన్నంబు నన వీనిక్రమ మొనర్తు. 43

హీనోపమము, అధికోపమము.—

తే. ఉర్విభును నల్పుఁ బోల్ప హీనోపమంబు, శ్వానమును బోలె నితఁడువిశ్వాసియనఁగ
నరయ నధికోపమం బల్పు నధికుఁ బోల్పఁ, బునుకవట్టినపే నీశుఁ బోలు ననఁగ.

అసమోపమము, అఖ్యాతోపమము.—

తే. ఉపమ సరివోని దిల నసమోపమంబు, హాలధరుఁడు మేరుగిరివోలె నలరు ననఁగ
వినుప్రసిద్ధంబు గాని దవిశ్రుతోప, మంబు వదనంబు కుముదంబుమాడ్కి యనఁగ.

పరుషము.—

క. పరుషార్థంబులు గలయది, పరుషం బనుదోష మయ్యెఁ బరఁగెడునీభూ
వరుసౌందర్యమునకు వే, మఱు సరి యౌ మంటఁ బడ్డ మదనుం డనఁగన్. 46

వ్యర్థము, ఏకార్థము.—

తే. అప్రయోజనంబు వ్యర్థ మౌ ఫేనిలం, బైనజలధి దాఁటె ననిలతనయుఁ
డన నభిన్నవాక్య మరయ నేకార్థ మౌ, సుగుణఖనిచరిత్రశోభి యనఁగ. 47

ససంశయము.—

క. క్రమమత్రిపదములు సంది, గ్ధము లైన ససంశయంబు ధరణీవసుధై
ర్యము నజము గెల్పు ననఁగా, నమరెడు సతిమేను మించు నసియించు ననన్. 48

విరుద్ధము.—

క. క్రమ మెడలి దేశకాలా, సముచితము విరుద్ధ మయ్యె సమదవిలోల
భ్రమరము చంపకవన మన, సముదంచితకేతకంబు చైత్రం బనఁగన్. 49

విరసము.—

క. ధర ననుచితరసభావము, విరసం బగు నితనిసమదవిద్వేషితలో
దరులు దరులందుఁ గుందఁగ, సరసము లాడుదురు ప్రేమ శబరు లఁటన్నన్. 50

అతిమాత్రము, హేతురహితము.—

క. క్షితిలో లోకాతీతం, బతిమాత్రము నింగి నిండె నబ్జాక్షికుచ
ద్వితయ మన హేతుశూన్యము, నలి గనుఁగొనె భృంగపంక్తి చనుదెంచె ననన్.

నిరలంకృతి, అశ్లీలము.—

క. ధరజాతిమాత్రశూన్యము, నిరలంకృతిబాహుయుతుఁడు నృపుఁ డన లజ్జా
కర మశ్లీలము పద్మిని, సరసాంగగృహాప్తు పద్మసౌరభ మనఁగన్. 52

సహచరచ్యుతము.—

క. సరిగా సరిగా నిది యు, ర్వరపైఁ బొందింప సహచరభ్రష్టం బొఁ
బరఁగు నెలచేత గగనం, బరుదుగ ఫేనంబుచేత నంబుధి యనఁగన్. 53

భిన్నము.—

క. భిన్నం బగుసంబంధవి, భిన్నం బితనినిరోధపృథివీశ్వరుఁ డా
పన్నం బైతేనమనుమన, నన్నలినజుభ్రాంత శూన్య మని పల్కఁ ననన్. 54

క. రసములు వాచ్యము లైనను, వెస నదియును దోష మయ్యె విపులోగ్రరణం
బసదృశబీభత్సరసో, ల్లసితము శృంగారసహితలలన యనంగన్. 55

గుణములు.—

తే. ఇంక గుణములు వివరింతు నివియుఁ గృతుల, దొరసి శ్లేషప్రసాదమాధుర్యసౌకు
మార్యసమతార్థదీపనౌదార్యకాంతు, లనఁగ నోజస్సమాధులు ననఁ జెలఁగు. 56

క. ఇల సంధి గూడి పదములు, నెలకొని యొకపదమురీతి నిలిచిన శ్లేష
బలరుఁ బ్రసిద్ధపదంబుల, నలఘూక్తి ప్రసాద మయ్యె నది యె ట్లన్నన్. 57

శ్లేషము.—

శా. ఆలావణ్యా మగణ్యా మాంగుళగిరం బవ్యాజ నా తేజ ము
ద్వేలం బావినయుం బమేయతర మావీర్యం బసిం[illegible] మా

యాలాపం బతిసత్య మావితరణం బాశాంతవిశ్రాంత మా
శీలం బార్జవమూల మెన్నఁ దరమే శ్రీనారసింహాధిపున్. 58

ప్రసాదము.—

ఉ. ముంగిటిపెన్నిధాన మిలుముంగటికల్పక మర్థికోటిముం
గొంగుపసిండి చెంగటన కూడినబంగరుకొండ దొడ్డిలో
నం గలకామధేనువదనం బెర యీఁగలు లేనిచొక్కపు
న్దంగెటిజున్ను నీవితరణంబు నృసింహనృపాలశేఖరా. 59

క. సరసము లగువాక్యంబులు, వరుసను వేర్వేఱ మించువగ మాధుర్యం
బరయఁగ బొట్లు పిఱుందుల, నరు దగునది సౌకుమార్య మది యె ట్లన్నన్. 60

మాధుర్యము.—

చ. అనయము యంత్రపుత్స్యము నొకమ్మున శ్రీనరసింహుఁ డేయఁగా
వెనుకఁకు బాఱి పుల్గఱచి వేషము మార్చి బిలంబు దూఱి కా
ననమున కేఁగి సిగ్గున నణంగి భరంపడి వీఁగి తావిషం
బెనసి నతి న్భజించి నదు లీఁది భ్రమించెను రాసు లన్నియున్. 61

సౌకుమార్యము.—

ఉ. చెందొవవిందుమంనునలెఁ జింగురుచిం దగఁ జందనంబు వె
చ్చందన మొందు నిందుముఖి చందము డెందమునం దలంప నీ
యందమునందె నందనమునందు మిళిందము పొందుపొందికం
జెందె నృసింహ కౌఁగిటను జేర్పుము ముందుగ మందగామినిన్. 62

క. లలితార్థభంగిఁ బాదం, బులు నాగ్గిట నేకసరణిఁ బొదువ సమత యగా
నిల నర్థము వ్యక్తం బై, నలు వొందిన నర్థదీపనం బె ట్లన్నన్. 63

సమత.—

సీ. శరవేగములు లేవె చలయంత్రపాఠీన, పాటనక్రియకు నేర్పడవు గాక
చాతుర్యములు లేవె శాగదాభండార, చోరకారశ్రీకిఁ జొరవు గాక
వితరణంబులు లేవె వివిధయాచకనృపా, లకకంఠదఘ్నము ల్కావు గాక
సామర్థ్యములు లేవె సరిదన్యపథయాన, శాసనప్రౌఢికిఁ జనవు గాక
తే. తొలుత గడిదుర్గముల నున్న దొరలు లేరె, నుహిమ నీమాడ్కి గదనదుర్గమదసపాద
సారసప్తాంగహరణులు లేరు గాక, నరసుతాటోప యోబయనరసభూప. 64

అర్థవ్యక్తి.

సీ. నలు వొందునమరేంద్రు నాగంబుసాటిగా, సాహుజంబుల నెల్ల సంతరించి
విఖ్యాతి కెక్కినవెలిమావుసాటిగా, సైంధవముల నెల్ల సవరణించి

మహిమ మించినమింటిమ్రాకులసాటిగాఁ, బాదపంబుల నెల్ల బాదుకొల్పి
పన్నె కెక్కినదేవవాహినిసాటిగా, నిల నెల్లయేఱుల నిరవుకొల్పి
తే. స్వర్గసృష్టికిఁ బ్రతిసృష్టి సలుపుకీర్తి, వసుధఁ గౌశికగోత్రపావనుఁడ వైన
నీక తగుఁగాక మఱి యన్యనృపులకగునె, సరసగుణహార యోబయనరసధీర. 65

క. కతిపయసంయుక్తాక్షర, వితతం బౌదార్య మయ్యె విమలవిచిత్రా
యతవర్ణావృత్తులు గల, యతిమృదుబంధంబు కాంతి యగు నె ట్లన్నన్ 66

ఔదార్యము.—

చ. ఎదిరినయోబశౌరి నరసేంద్రునికీర్తినిజాంశుపంక్తికిన్
మదనవిరోధి భీతుఁ డయి మార్కొన కేఁగినఁ దద్రథంబు ద
త్పదనము నాక్రమించి రభసంబున నావృషభాధిపధ్వజున్
వెదకఁ జుమీ యజాండముల వే వెపలెం గడిలేనియీాసునన్. 67

కాంతి.—

సీ. నెలవంక తోడివెన్నెలవంక గలమేటి, నెలవంక రహితాంశునియతిఁ దెగడి
ననయమ్ము వానిఁ గన్ననయమ్ము గలయింతి, ననయమ్ము డాల్చువానన్నఁ జెనకి
కడలేక తరిగొండ కడలేకడలఁ ద్రోయు, కడ లేక మైనమీఁగడల గెల్చి
కవురాలపన్నె చొక్కపురాల నగుమేని, కపురాలపోతు బింకంబు నణఁచి
తే. తనరుచులు లోకములు నిండఁ దనరుచుండు, లాటకరహాటలలనాలలాటఫలక
మలయజము లైననీదునిర్మలయశంబు, లమితగుణసాంద్ర నారసింహక్షితీంద్ర. 68

క. విలసితసమాసభరితో, జ్జ్వలబంధం బోజ మయ్యె సరియన్యగుణం
బులు మఱి వేఱొక్కటిపై, నలరింప సమాధి యయ్యె నది యె ట్లన్నన్. 69

ఓజము.—

సీ. మందారబిసకుందకుందాదినిధిబృంద, బృందారకాప్తశోభితయశుండు
హేలావిజితహాలహాలాశనోత్తాల, తాలాంకభుజదండతాండవుండు
దీనావననిదానదానాంబుజనదీన, దీనాథపరిణయస్థితివిధాయి
భీమాసురవిరామరామాతిశయధామ, ధామాంబకనిభాసిదారితారి
తే. రాజమార్తాండె పనుధాధిరాజమకుటు, నికటవికటమహానీలనికరనుకర
మధుకరకరంబితాంఘ్రిపద్మద్వయుండు, సరసగుణహార యోబయనరసశౌరి. 70

సమాధి.—

సీ. అలబలీంద్రునిచేత నడుగు వెట్టఁగ నేర్చి, ధారాధరముచేత నీరు మోచి
కాసీనుచేఁ గంచుకముఁ బూనఁగా నేర్చి, యెలమి దధీచిచే నెమ్ము బలిసి

క్షీరాంబురాశి ద్రచ్చినవెన్న నీడేరి, నైలింపగవిచన్నుఁబాలఁ బెరిఁగి
కల్పపాదపఫలోత్కరములఁ జవి గాంచి, వనజారి నెమ్మేన ననఁగి పెనఁగి
తే. ధరణిఁ బ్రోది వహించినదానకన్య, సకలయాచకబాంధవు ల్సంతసిల్ల
నీకరగ్రహణావాప్తి నెరసె నౌర, వైరిగజసింహ యోబయనారసింహ. 71

శబ్దాలంకారములు.—

తే. ఇఁక నలంకారనికరంబు లేర్పరింతు, నవియుఁ గవితాలతాంగికి హారకటక
కంకణాదులక్రియ నలంకరణకరణ, పరిణతులచే నలంకారభావ మొందు. 72

క. ఇవియును శబ్దార్థంబుల, ద్వివిధములై క్రమముతోడ వెలయు ననుప్రా
సవిశేషంబుల నుపమా, దివిశేషములను గావ్యదీపితసరణిన్. 73

తే. అం దనుప్రాసభేదంబు లైన శబ్ద, భవదలంకారమును మున్ను ప్రస్తుతింతు
నడర నెడ లేక రెండు రెం డక్షరంబు, లెనయు నియమంబు ఛేకమా నెట్లు టన్న.

పంచచామరము. స్ఫురత్కృపాబలప్రతాపభూతిధైర్యభూభరా
ర్చిరంగదానబుద్ధివైఖరి స్వరి స్వరి స్సుధా
హరు స్వరు న్గిరి గిరి న్మహానలు న్నలు న్రమా
గురు న్గురు న్జయింతు వౌఁ దగు న్నృసింహభూవరా. 75

తే. ఒక్కవర్ణంబు కడదాఁక నుద్ధరింపఁ
బరఁగు జృంభణవృత్త్యనుప్రాస మయ్యెఁ
దలఁపఁ బునరుక్తి యయ్యుఁ దాత్పర్యభేద
మెనయు నియమంబు లాట మా నెట్లఁటన్న. 76

వృత్త్యనుప్రాసము.—

చ. సమదవిపక్షశిక్షణవిచక్షణదక్షిణదోరనుక్షణ
భ్రమదసిదుర్నిరీక్షసమరక్షపితక్షితిపక్షతక్షర
త్సమధికశోణితక్షరకృతక్షణరక్షితపక్షిలోక నీ
గమలదళాక్షుఁ డేలు బలగౌరవసింహ నృసింహభూవరా. 77

లాటానుప్రాసము.—

చ. ఘనతనృసింహుఁ జూడఁ గలకన్నులు కన్నులు వానికౌఁగిటం
జనువున నేపు చూపఁ గలచన్నులు చన్నులు వానిమోవికిం
జొనిపిన పాటలాధరము జున్నులు జున్నులు వానిమేనఁ జే
ర్చినసరసాంగవల్లికలచెన్నులు చెల్వులువో తలోదరీ. 78

క. సమవర్ణయుగాధికమై, యమరిననియమంబు యమక మగుఁ గృతులం దా
యమకం బనేకవిధ మగుఁ, గ్రమమున నొకరెండుమూఁడుగతు లెత్తిఁగింతున్.

క. మేలిమి రెండవపాదము, నాలవపాదంబు నొక్కయనువునఁ దనరం
జాలినయమకము కృతులం, దాలింపఁగఁ బాదయమక మగు నెట్లన్నన్. 80

పాదయమకము.—

క. ధీరా యోబన్నృపాలక, మారా మనుమదనసమరమాధుర్యుఁడ వై
ధీరాన్నృసింహకూడితి, ఘోరా మనుమదనసమరమాధుర్యుఁడ వై. 81

క. ప్రస్తుత మగుముక్తపద, గ్రస్తం బన నదియుఁ గృతులఁ బరఁగు బదాంతో
ద్ద స్తము పాదాద్యంతను, విస్తృతము పదాంతసింహవీక్షణ మనఁగన్. 82

పాదాంతపాదాదిముక్తపదగ్రస్తము.—

క. సుదతీనూతనమదనా, మదనాగతురంగపూర్ణమణిమయసదనా
సదనామయగజరదనా, రదనాగేంద్రనిభకీర్తిరసనరసింహా. 83

సింహావలోకనముక్తపదగ్రస్తము.—

క. మన వేటికి నూతనమా, తన మాయెడఁ బ్రేమ దనకుఁ దక్కితి ననుమా
ననుమానక దయ దనరం,దనరంతులు మానినరసధవు ర మ్మనవే. 84

పద్మబంధము.—

చ. కనుఁగొన రేకు లెన్మిదియుఁ గర్ణిక చుట్టిడి స్రగ్ధరాంఘ్రిల
న్ననుపటిమేడువర్ణములునుం గడయేడుఁ బ్రవేశనిర్గతు
ల్వనుపడ నాల్గుదిగ్దళముల న్లిఖియించి విదిగ్దళంబులం
దెనయఁగఁ బాదమధ్యగము లేడును వ్రాయఁగఁ బద్మబంధ మౌ. 85

స్రగ్ధర. రామాకశ్రీసమగ్రారణకృతభయముద్రాసనక్షాత్రమారా
రామారక్షాసనద్రాప్తిభరణపటిమాత్రాసకుస్త్రీకుమారా
రామాకుస్త్రీకుసత్రాప్రకటతరవిచిత్రాపవిత్రాసమారా
రామాసత్రావిపత్రాశ్రయనరసరుచిగ్రామసశ్రీకమారా. 86

చక్రబంధము.—

క. పదిచుట్లు నాలు రేకులు, పదిలపతిచి సుకవి పేరు పతి పేరును లోఁ
బొదలఁగ నేవంవిధగుణ, విదితం బగుచక్రబంధవిధ మౌ నెట్లనన్. 87

శా. రక్షానాకపమూర్తిభాసురగభీరావిక్రమోహాస్పదా
దక్షారమ్యమతిస్థిరాభరణవిద్యాకృత్యశౌర్యజ్ఞస్వనా
వక్షస్సింధుపకన్యకానరసభవ్యాలిగ్మధీతంత్రదా
దాక్షిణ్యారతనాదవైభవవినోదా హేమనాగాశ్వదా. 88

వృత్తకందగర్భసీసము.

మహితవిద్వజ్జనమండలీవినుతసాహిత్యప్రియంభావుకాత్యుదార
వితతభీమాహవవిక్రమక్రమసము, ద్యద్ద్వైరినిర్భేదనాభిరామ
వినుతవిశ్రాణనవిభ్రమాపహసితా, నూనామరక్ష్మారుహా నృపేంద్ర
వినతభూపాలకవిస్ఫురన్మకుటర, త్నద్యోతితాంచత్పదా మహాత్మ
తే. 'నిరుపమదయాపయోనిధినిరతభరిత, చారుచరితనిర్మలతరసత్యరుచిర
తరణికులమణీనరసింహధరణిరమణ, ఘనతరగుణనిధీ' యనుజనులు వొగడ. 89

ఓష్ఠ్యనిరోష్ఠ్యసంకరము.—

శా. భూనాథోత్తమ జంభభంజనమహాభోగాభిరామక్రియా
దానోజ్జృంభితవారిపూరభరితోద్యద్వార్ధివీచివ్రజా
మానామేయసుధాబ్ధినిర్మలగుణా మాద్యన్మహాయూథప
శ్రీనూత్నప్రథమానభాగ్యపరవైరివ్రాతభేదివ్రతా. 90

క. నీహారశిఖరిశిఖర, వ్యూహామితతుహినకణమహామహిమ మహా
మోహాపహవిమతవరా, రోహణమణిహారనయన రూఢవిహారా. 91

లయగ్రాహి. మిత్రకులభూషణయమిత్రకులభీషణవిచిత్రమృదుభాషణచరిత్రమణిహారా
జైత్రవిశిఖాసన బలచ్ఛిత్పురశాసన పవిత్రగుణభాసన సగోత్రధృతిధీరా
క్షాత్త్రశుభలక్షణ సుపాత్రజనరక్షణ కుశాత్రయవిచక్షణ యకృత్రిమవిహారా
గోత్రసమసింధుర కళత్రితవసుంధర పతత్త్రిరథబంధుర తనుత్రభుజసారా. 92

గద్యము. ఇది శ్రీహనుమత్ప్రసాదలబ్ధ కవితాసారసారస్వతాలంకార నిరంకుశప్రతిభాబంధుర ప్రబంధపరనరచనాధురంధర ప్రబంధాంక వేంకటరాయభూషణ సుపుత్త్ర తిమ్మరాజపౌత్త్ర సకలభాషావిశేష నిరుపమావధాన శారదామూర్తి మూర్తి ప్రణీతం బైనకావ్యాలంకారసంగ్రహం బనుమహాప్రబంధంబునందుఁ ద్రివిధదోష నిర్ణయంబును గుణప్రకరణంబును శబ్దాలంకారసంగ్రహంబు నన్నది చతుర్థాశ్వాసము.

---

శ్రీ ర స్తు.

# న ర స భూ పా లీ య ము

## కావ్యాలంకారసంగ్రహము - పంచమాశ్వాసము.

---



నందనసౌందర్యాబు
ధానందనకీర్తివిజితహరిచందనమే
ధానయనిధానదానే
దానీంతనకర్ణ నరసధరణీశమణీ. 1

తే. అవధరింపుము లక్ష్మలక్ష్యముల నెల్ల, ననఘ భవదీయ నామధేయాంకితముగ
బహువిధస్థల నొనరింతుఁ బద్యవితతి, నింకఁ జతురార్థభవదలంకృతులు వరస. 2

వ. ఉపమానన్వయోపమేయోపమా స్మరణ రూపక పరిణామ సందేహ భ్రాంతిమ
దపహ్నవోల్లేఖోత్ప్రేక్షాతిశయోక్తి సహోక్తి వినోక్తి సమాసోక్తి వక్రోక్తి
స్వభావోక్తి వ్యాజోక్తి మీలన సామాన్య తద్గుణాతద్గుణ విరోధాభాస విశేషా
ధిక విభావనా విశేషోక్త్యసంగతి విచిత్రాన్యోన్య విషమ సమ తుల్యయోగితాదీ
పక ప్రతివస్తూపమా దృష్టాంత నిదర్శనా వ్యతిరేక శ్లేష పరికరాక్షేప వ్యాజస్తు
త్యప్రస్తుతప్రశంసా పర్యాయోక్తి ప్రతీపానుమాన కావ్యలింగార్థాంతరన్యాస
యథాసంఖ్యార్థాపత్తి పరిసంఖ్యోత్తర వికల్ప సముచ్చయ సమాధి భావిక ప్రత్య
నీక వ్యాఘాత పర్యాయ సూక్ష్మోదాత్త పరివృత్తికారణమాలైకావళీ మాలాదీపక
సార రసవత్ప్రేయ ఊర్జస్వి సమాహితంబు లన నెబ్బదియలంకారంబులు. అందు
రూపక పరిణామ సందేహ భ్రాంతిమదుల్లేఖాపహ్నవోత్ప్రేక్షా స్మరణ తుల్య
యోగితా దీపక ప్రతివస్తూపమా దృష్టాంత సహోక్తివ్యతిరేక నిదర్శనాశ్లేషంబులు
పదియాఱును బ్రతీయమానౌపమ్యంబులు, సమాసోక్తి పర్యాయోక్త్యాక్షేప
వ్యాజస్తుత్యుపమేయోపమానన్వయాతిశయోక్తి పరికరాప్రస్తుత ప్రశంసానుక్త
నిమిత్తవిశేషోక్తులు పదియును బ్రతీయమానవస్తుకంబులు, రసవత్ప్రేయఊర్జస్వి
సమాహితభావికంబు లేనును బ్రతీయమానరసభావంబు లగు కడమయుక్తనిమిత్త
విశేషోక్తిసహితంబు లగు నుపమాద్యలంకారంబులు నలువదియు నస్ఫుటప్రతీయ
మానౌపమ్యరసభావంబు లగు నందు. 3

సీ. అవని సాధర్మ్యంబు త్రివిధ మాభేదప్ర, ధాన మభేదప్రధాన మరయ
నుభయప్రధాన మై యొగి దీపకము తుల్య, యోగితయుఁ బ్రవస్తూపమయును

దృష్టాంతముఁ సహోక్తియు నిదర్శనప్రతీ, పము వ్యతిరేకంబు ప్రబలు భిన్న
సామ్యము ల్రూపక సందేహ పరిణామ, ములు భ్రాంతిమదపహ్నుతులు నభిన్న
తే. సామ్యధర్మంబు లుల్లేఖసంగతముగ, నుపమయుపమేయకోపమయును ననన్వ
యంబు స్మరణంబుఁదలఁపభేదావిభేద, సహితసాధర్మ్యగుణవిశిష్టములు మఱియు.
సీ. అతిశయోక్త్యుత్ప్రేక్ష లధ్యవసితమూల, లాగి విభావనవిశేషోక్తివిషమ
ములు నసంగతిచిత్రముల తద్గుణాన్యోన్య, ములు భావికవిశేషములు విరోధ
జన్యము ల్వ్యాఘాతసహితంబు గాఁగ స, ముచ్చయంబు వికల్పముఁ బరిసంఖ్య
మలయథాసంఖ్య మర్థాపత్తిపర్యాయ, ఘనములు పరివృత్తి ప్రత్యనీక
తే. తద్గుణసమాధులు వినోక్త్యుదాత్తసమము, లును స్వభావోక్తి లోకవర్తనఘనములు
గరిమ ననుమానకావ్యలింగములు తర్క్య, జంబు లర్థాంతరన్యాససంగతముగ. 5
సీ. కారణమాలికైకావళీసారమా, లాదీపకంబు లుల్లసితశృంఖ
లావినిత్రత్వమూలములు వ్యాజోక్తివ, క్రోక్తి మీలన మపహ్నుతిఘనములు
పరఁగు సమాసోక్తిపరికరంబులు విశే, షణజాతచాతుర్యసంఘనములు
కడమశ్లేషాద్యలంకారము లప్పోహ్యాది, తన్యాయనిరపేక్షతాయుతంబు
తే. లీయలంకారముల కెల్ల నిలఁ బ్రధాన, మైనయుపమయ ముందుగా ననువు గొల్పి
యొకటి కొకటికి భేదము ల్ప్రకటములుగ, సరవి నెఱిఁగింతు లక్ష్మలక్ష్యమ్ము లెలమి.
సీ. ఉత్ప్రేక్షవలె నసిద్ధోపమ కాక న, న్వయముకైపడి నభిన్నంబు గాక
హీనోపమయుఁబోలె నిల నహృద్యము గాక, యుపమాన మనఘు మైయుండెనేని
శ్లేషంబువలెఁ బదశ్లిష్టమాత్రము గాక, సార్థమై యల రూపకాదులక్రియ
వ్యంగ్యంబు గాక సామ్యమువాచ్య మగునేని, యౌపమ్యము ప్రతీప మట్లు తలఁపఁ
తే. క్రమవిపర్యాససహితంబుగాక యున్న, నలరు నుపమేయకోపమ యట్లు సామ్య
ధర్మనిరుపమానువరుసలఁ దడవ కున్న, నుపమ యగుదీనిభేదంబు లెగ్గడింతు. 7
తే. ఒనరు నది పూర్ణయును లుప్తయును ననంగ
నందు నుపమాన ముపమేయ మలరు సమత
సామ్యవాచకమును గూర్పఁ జాలఁ బూర్ణ
కొన్నికడ మైనలుప్తయై కొమరుమిగులు. 8
తే. అందు నుభయాఖ్య యగుఁ బూర్ణ యార్థి శ్రౌతి
యనఁగ రఘురామసన్నిభుఁ డనెడిచోట
నార్థి కందర్పుఁడునుబోలె నలరుచుండు
నధిపుఁ డనుచోట శ్రౌతియై యతిశయిల్లు. 9
క. ధరయం దార్థియుఁ ద్రివిధాం, తర మయ్యె సమాసవాక్యతద్ధితగతయై
తిరముగ వాక్యసమాసా, చరణంబుల ద్వివిధ యగుచు శ్రౌతియుఁ దనరున్. 10

క. అల తద్ధితములయందుం, జెలియ వతిప్రత్యయంబు తెలుఁగున లేమిం
గలిగినకల్పప్ప్రత్యయ, ములరుచు నయ్యార్థియందె యది గనుపట్టున్. 11

ఉ. కావునఁ బూర్ణపంచవిధ కర్ణ్మన లుప్తయు సామ్యధర్మ మీ
ఠావిధిఁ గూర్ప పన్నరెండ్ శ్రౌతియు నార్థియునై యథోక్తసం
భావనవాక్యయుక్తయు సమస్తయు వాక్యసమాసతద్ధిత
శ్రీవిశదాత్మయై ధరణిఁ జెన్నగు సాయకసంఖ్య నెట్లనన్. 12

సమాసగతపూర్ణార్థి.—

క. ఈవియుఁ జల్లఁదనంబును, గేవలసౌందర్యగుణము గీర్తిఁ గొనఁగఁ గళా
భావుకుఁడైననృసింహ, క్ష్మావల్లభుఁ డమరుఁ బూర్ణచంద్రోపముఁడై. 13

వాక్యగతపూర్ణార్థి.—

క. వెలయుజవరాండ్రు తలఁపుల, వలపును నిలుపంగఁ జాలు వరరూపమునం
జెలఁగుచు నృసింహుఁ డలరుల, విలుకానికి సాటి యయ్యె విశ్రుతలీలన్. 14

తద్ధితగతపూర్ణార్థి.—

క. ఏయెడల నియ్యనియ్యల, గాయలు గాచిన నృసింహుకర మర్థులకుం
బాయనివేడ్క ఫలించుచు, నాయతగతిఁ గల్పకల్పమై విలసిల్లున్. 15

వాక్యగతపూర్ణశ్రౌతి —

క. దివియును భువియును భుజగము, భువనంబును నిండి విమలభూరిప్రభతో
దివిజేంద్రతటినియో యన, నవిరళగతిఁ బొల్చు నీదుయశము నృసింహా. 16

సమాసగతపూర్ణశ్రౌతి.—

క. కరముల శంఖము చక్రము, నిరవుగ నురమందుఁ జెంది యిందిర దనరన్
హరివలె వెలయుదు వౌరా, నరసాహసయోబరాజు నరసింహనృపా. 17

పంచవిధానుపాత్తధర్మలుప్తోపములు.—

శా. నీదోఃఖడ్గమహీంద్రుఁడో యనఁ దగు న్నీదివ్యతేజోభరం
బాదిత్యుండనుబోలెఁ బొల్చు భవదీయాలాపము ల్వల్లకీ
నాదబ్రహ్మము సాటి నీకరము మందారోపమానంబు నీ
ప్రాదుర్భావము సాధవాభ్యుదయకల్పం బౌ నృసింహాధిపా. 18

అనుపాత్తోపమానలుప్త.—

సీ. జలదంబుగతి నిచ్చి వెలవెలఁ బోఁడక, కలశాంబునిధిరీతిఁ గసరుకొనక
యాగ్రమ్రాన్పలె ఫలం బడి జిగి దప్పక, సురభికైవడిఁ గోలు పరసి యీక
కపులారివలె నిచ్చి క్రమ్మఱఁ గైకోక, బలిమాడ్కి నర్థిచే భంగపడక
చండాంశుసుతుపోల్కిఁ గుందమాన్పులు గాక, వాసనమణిభాతిఁ బ్రాసమంద
తే. కొసఁగ నేర్తువు యాచకవ్రాతమునకు, ఘనుఁడవౌ నూనదానవిద్యానిరూఢిఁ
బొసఁగ నీతోడ నెవ్వాఁడు బోల్ప వచ్చు, సరసగుణహార యోబయనరసధీర. 19

అనుపాత్తవాచకలుప్త.—

సీ. దర్పితాహితనృపోత్తములఁ ని న్నెదిరింపఁ, గలరె ధీరోత్తమగండబిరుద
విమతకీర్తిప్రతాపములు నీచే సమ, కట్టునే యుభయరగండబిరుద
యరివధూతాటంకగరిమంబు నీచేతఁ, గలుగునే గండభేరుండబిరుద
పరిపంథిగంధసింధురపంక్తి నీమ్రోల, నుండునే గండభేరుండబిరుద
తే. యరుణపరిణతధామ రామాభిరామ, రమణీయకనిర్జితప్రసవబాణ
బాణసాహిత్యపరిపాకపాకవైరి, విభవసౌభాగ్య యోబభూవిభునృసింహ. 20

తే. అరుణపరిణతధామ రామాభిరామ, యనెడిచో భానువైనడి నలరుకాంతి
పంక్తి గలవాఁడు రామునిపగిదిఁ బొల్చు, వాఁడు ననువాచకం బవివక్షితంబు.

అనుపాత్తవాచకధర్మోపాదానలుప్త.—

సీ. ఇటు వేసితేజీల నెనయఁ మిన్నులలేరి, జోదు పుట్టినకొండఁ జూచినాఁడ
నిటు నేల జేజేల కెఱుకైనచెంగావి, నుద్దసంజఁ దగుకొండఁ జూచినాఁడ
నిటు కోడెరాతు మైనిడ్డ సొమ్ములమేఁత, సొంపు లీనెడుకొండఁ జూచినాఁడ
నిటు నల్లదేవరయింట నంటినతెల్ల, జోటివా యనకొండఁ జూచినాఁడ
తే. నిందు నఁదునను నీతోడియీడువానిఁ, గడకతోఁ గానఁగానను గాన నమచు
నిక్క మేబాస కైనను నిల్చువాఁడ, నరసుతాటోప యోబయనరసభూప. 22

అనుపాత్తవాచకధర్మోపమానలుప్త.—

మ. మహితప్రాభవమానధుర్యమితవాఙ్మర్యాదమీనాంకవి
గ్రహముఖ్యాన్వయమూర్తిశౌర్యరసమేఘత్యాగమైత్రీరఘూ
ద్వహమేధాన్వితమాక్తికౌభరణమంత్రప్రౌఢమస్త్రాగ్రస
క్తహరిశ్రీచరణాబ్జవర్ధిలు గుణాధారా నృసింహాధిపా. 23

తే. అలర మీనాంకవిగ్రహుం డనెడిచోట, నిందు మీనాంకుమైవలె నింపు మీఱు
విగ్రహము గల్గువాఁ డన వెలయు సామ్య, వాచకోపమానంబు లనూచితములు.

క. ద్వివిధం బగుసాధర్మ్యము, భువి నుపమానోపమేయముల కొక్కటియై
తవుటయు రెంటికి ద్వివిధం, బవుట యన ద్వితీయగతియు నలరు ద్వివిధమై. 25

క. క్షితి నేకార్థము శబ్ద, ద్వితయంబున సంఘటింప వెలయును వస్తు
ప్రతివస్తుత యనుబింబ, ప్రతిబింబత యర్థశబ్దపార్థక్యమునన్. 26

వస్తుప్రతివస్తూపమ.—

క. అవనిఁ బరిష్కృత మయ్యెన్, రవివంశం బోబశౌరినరసింహునిచే
దివిచరతరుభూషిత మై, నవనవగతిఁ బొల్చు నందనవనం బనఁగన్. 27

బింబప్రతిబింబోపమ.—

క. గురుశౌర్యయుతము నాయత, కరవాలము నగునృసింహుఘనభుజ మలరన్
దరళితఫణామణికిరణ, స్ఫురణము జిహ్వాల మైనభోగియుఁ బోలెన్. 28

అనన్వయము.—

క. సరసం బగు నొక్కటికే, ధర నుపమానోపమేయధర్మము దిర మై
పరఁగిన ననన్వయం బగు, నరయంగా దీనిలక్ష్య మాపాదింతున్. 29

క. నీదయకు నీడు జోడగు, నీదయ నీజయముసాటి నీజయ మిలలో
నీదానమునకు నెన యగు, నీదానము నీకు సాటి నీవె నృసింహా. 30

ఉపమేయోపమ.—

క. నిర్ణిక్తి నుపమేయం, బుపమానముఁ బోల మఱియు నుపమానం బా
యుపమేయముఁ బోలఁగఁ దగు, నుపమేయోపమ యనంగ నొగి నె ట్లన్నన్. 31

క. శరణాగతభరణంబున, నరసింహునిసాటి నచ్చు నరసాహుఁడు డీ
నరసింహుఁ డితని కెన యౌ, నరసింహుఁడె కాక యితరనరులకు నశ మే. 32

స్మరణము.—

క. ధర నొకవస్తువుఁ గనుఁగొని, వరుసం దత్సదృశ మైనవస్తువు దలఁపన్
స్మరణం బని పాటింపుదు, రరయ నలంకారవేత్త లది యె ట్లన్నన్. 33

క. ఇల యంత్రమత్స్యమేయును, విలు పూనినశ్రీనృసింహవిభుఁ గాంచి జనుల్
తలఁపుదురు ద్రుపదకన్యా, కలితకరగ్రహణనమితకార్ముకుఁ బార్థున్. 34

రూపకము.—

మ. అల సందేహముమాడ్కిఁ గాక యుపమేయం బెన్న నచ్చన్న మై
యలఘూత్ప్రేక్షయు నా న భిన్నమతిజం బై యుండ కారోప మిం
పలరంగాఁ బ్రకృతోపమోగిపరిణామారోపతుల్యంబు గా
కలయారోపిత మిందు రంజనకు నేయన్ రూపకం బై తగున్. 35

క. అరయ రసజ్ఞుల మతమున, నరు దగునిరూపకంబు సావయవంబు
న్నిరవయవంబును వరుసం, బరంపరిత మనఁగఁ ద్రివిధభావము నొందున్. 36

చ. అరయ సమస్తవస్తువిషయంబును నేకతలప్రవర్తి యై
యరుసుగఁ బొల్చుసావయవ మవ్వలఁ గేవలమాలికాఖ్య మా
నిరవయవంబు శ్లిష్టమును నేర్పున శ్లేషవిహీన మా పరం
పరితము తత్ప్రభేదములఁ బాయక కేవలమాలికాఖ్య మా. 37

క. కావున రూపక మష్టవి, ధావహ మగులక్షణంబు లలలక్ష్యంబుల్
వావిరి నొనర్తు వీనికి, భావజధనురసమరసవిభాసితఫణితిన్. 38

క. అవయవియును నవయవంబులు, వివరింప సమస్తవస్తువిషయం బిలలో
నవయవి యవయవగమ్యం, బవునది యేకతలవర్తి యగు నెట్లన్నన్. 39

సమస్తవస్తువిషయసావయవరూపకము.—

మహాస్రగ్ధర.

హిమశైలద్వీపదీప్తం బినమణిమహితం బిందుశంఖాభిరామం
బమరాంభోమర్త్యయుక్తం బహిపలహరికం బభ్రశైవాలజాలం
బమితాశాకుంభినక్రం బజహదుడుకణం బాత్తసంధ్యాప్రవాళం
బమరున్ శ్రీనారసింహోద్యతవిశదయశోహారిదుగ్ధాబ్ధి వేడ్కన్. 40

ఏకదేశవర్తిసావయవరూపకము.—

క. ధర నోలి యనువల్మీకము, సరభసగతి వెడలి నీదుచటులాసి మదో
ద్ధురచరదరిధరణిధురం, బరజీవానిలముఁ గ్రోలు నరసింహనృపా. 41

క. అవయవిమాత్రంబున నే, కవిమతి విశ్రాంత మైనఁ గన నిరవయవం
బవని నిది కేవలంబును, ద్వివిధత మాలికయు నయ్యె విను మెట్లన్నన్. 42

కేవలనిరవయవరూపకము.—

క. ఇల నీదుకీర్తి చంద్రిక, యలఘుతరస్ఫూర్తి నలినజాండకరండం
బులు నిండి వెల్లివిరిసె, న్నలనహుషసమానశీల నరసనృపాలా. 43

మాలానిరవయవరూపకము.—

క. హారశిఖరిదరులభాషా, తరుణీకుచగిరుల నమరతరులం జెలఁగున్
ఝరులై సరులై విరులై, నరనుత మగునీదుకీర్తి నరసింహనృపా. 44

క. రూపక కారణ మై తగు, రూపకము పరంపరితము రూపింపఁగ నిం
దే పగు నాల్గునిభేదము, లాపాదించెద నుదంచితాయతఫణితిన్. 45

శ్లిష్టకేవలపరంపరితరూపకము.—

క. నిరతంబు రాజహంసలఁ, బరువెత్తఁగఁ జేయు నౌర పటుచటులభవ
త్కరకరవాలకరాళి, స్ఫురితాంభోదము నృసింహభూపాలమణీ. 46

శ్లిష్టమాలాపరంపరితరూపకము.—

క. కువలయవికసనహిమకరుఁ, డవిరళదానాంబుదిగ్గజాగ్రణిపద్మో
త్సవసౌభాగ్యదివాకరుఁ, డవనివి నరసింహుఁ డితని కన్యులు సరియే. 47

అశ్లిష్టకేవలపరంపరితరూపకము.—

క. కాతరతరవిమతధ్వజి, నితతకాంతారతతికి నీచేతిమహా
హేతిదవజ్వలనోజ్జ్వల, హేతి సుమీ యోబధారుణీశ్వరునరసా. 48

ఆశ్లిష్టమాలాపరంపరితరూపకము.—

మ. వనితానేత్రచకోరచంద్రిక యశోవల్లీవసంతోదయం
బనిదంపూర్వకథాసుధాబ్ధిభుజగర్వాదిత్యప్రాఁర్వాచలం
బనఘోద్యద్గుణరత్నరోహణము నీయాకార మెవ్వారికిన్
వినుతింప న్వశమే నృసింహకరుణావిన్యాసధన్యాత్మకా. 49

పరిణామము.—

క. ధరలో నుపమేయమునను, నరుదుగ నారోప్యమాణ మగునుపమానం
బరయఁ బ్రకృతోపయోగా, కరముగఁ బరిణామ మయ్యెఁ గను మెట్లన్నన్.

క. నైలింప సతులకౌఁగిటఁ, దేలుటకై దివికి నేఁగుదృప్తారులకున్
నీలాల నిచ్చె నాయెను, నీలాలితహేతి యోబనృపనరసింహా. 51

సందేహము.—

తే. విషయివిషయంబుఁ గవిమతి విహితసామ్య
దీప్తసందేహ మొంద సందేహమదియు
గరిమశుద్ధంబు నిశ్చయగర్భితంబు
నిశ్చయాంతంబు నగుదీని నిశ్చయింతు. 52

శుద్ధసందేహము.—

ఉ. ఇంద్రుఁడో యాయుపేంద్రుఁడో బలీంద్రుఁడో పార్వణచంద్రుఁడో హరి
శ్చంద్రుఁడో రామచంద్రుఁడో రసాభరణప్రవణాత్ముఁడైన నా
గేంద్రుఁడో యానగేంద్రుఁడో మృగేంద్రుఁడో యంచుఁ దలంతు రార్యు లీ
సాంద్రభుజప్రతాపరణసాహసు నోబయనారసింహునిన్. 53

నిశ్చయగర్భితసందేహము.—

మ. హరుఁడో యీఘనుఁడైన మౌళిధృతతోయం బెద్ది దైతేయసం
హరుఁడో యీనృపుఁడైన నవ్విహగవాహం బెద్ది వాణీమనో
హరుఁడో యివ్విభుఁడైన సారసనివాసాధ్యాసనం బెద్దియం
చు రసజ్ఞుల్వినుతింతు రాత్మ నరసక్షోణీశు వీక్షించుచున్. 54

నిశ్చయాంతసందేహము.—

సీ. తలపోయ వల్లిమతల్లికే గతిఁ గల్గె, నలసాలసానూనయానకలన
భావింప మణిసాలభంజిక కెటు లబ్బె, లాలితాలాప లీలాకలాప
మూహింపవిమలవిద్యుల్లేఖ కేలీల, నొదవె ధాత్రీభాగయోగగరిమ
మరయంగ మదనమంత్రాధిదేవతకు నే, గతిఁ గల్గె నంగసంగప్రసంగ
తే. మనుచు శబరులు సందియం బంది యంది, తెలియుదురు తోన నీధాటికలికితలఁకి
యహితవనితలు వనవాటి నడలు చునికి, నరసుతాటోప యోబయనరసభూప. 55

భ్రాంతిమంతము.—

క. అల యుపమేయము ఛన్నత, నలరఁగ నారోప్యమాణ మగునుపమానం
బిల నెఱుకపడఁగ భ్రాంతిమ, దలంకరణ మయ్యె దీని నాపాదింతున్. 56

శా. చూడం జూడ నృసింహకీర్తిచయమీక్షోణీనభోమధ్యమం
దేడం జూచినఁదాన యై నెగడఁగా నీక్షించి మిన్నేటనీ
రాడం బోయెడిబేసితాపసులు మే లౌ మ్రోల సిద్ధించెఁ గా
యాడం బోయినతీర్థ మంచు మదిలో హర్షింతు రశ్రాంతమున్. 57

అపహ్నవము.—

క. ఉపమేయము గా దని యిది, యుపమానమె యనఁగ నెంతయు నపహ్నవ మా
నపు డది ప్రాగారోపము, నపహ్నవారోపమును ఛలాదియు నయ్యెన్. 58

త్రివిధాపహ్నవములు.—

మ. గురుచక్రప్రభగాని శౌర్యసువమాంకూరంబుగా దిందుభా
స్వరకీర్తిద్యుతిపంక్తి గాదు నిబిడాంచత్పాంచజన్యప్రభా
భర మాఁగా నటుగాన విశ్వభరణప్రారంభముం గోరి యీ
నరసేంద్రాకృతి నుద్భవించెఁ గమలానాథుండు విశ్వంభరన్. 59

ఉల్లేఖము.—

క. అలరఁగ గృహీతృభేదం, బుల నొకటియె పెక్కురూపముల నెడ నెడలం
దలపోయఁగ నుల్లేఖం, బలంకరణరాజ మయ్యె నది యె ట్లన్నన్. 60

క. బాణుఁ డని బుధులు మురజి, ద్బాణుం డని విమతభూమిపాలురు సుమనో
బాణుఁ డని సతులు దలఁపుదు, రేణాంకసమాను నోబళేంద్రు నృసింహున్, 61

ఉత్ప్రేక్ష.—

క. ఉపమేయమునకుఁ గలిగిన, యుపమానగుణక్రియాదియోగముచే నా
యుపమానమె యని తలఁచిన,నపు డది యుత్ప్రేక్ష యయ్యె నదియును ధరణిన్.

క. క్రమమున వాచ్యయును బ్రతీ, యమానయును నగుచు ద్వివిధ యగువాచకశ
బ్దము గలుగ వాచ్య యనఁ దగు, నమరఁగ లేనియెడ గమ్య యనఁదగు వరుసన్.

సీ. అలరెడునీరెంటియందు జాతిగుణక్రి, యాద్రవ్యము లవాచ్యయభిసంఖ్య
యవి నాల్గు వరుస భావాభావములఁ జెంద, నిల నసుసంఖ్య యాఁరెనిమిదియును
నిరువదినాలు గాఁ హేతుఫలస్వరూ, పముల వేర్వేఱఁ ద్రిభంగిఁ జెంద
నందు నెన్మిది యెన్మి దగుహేతువుఫలంబు,నలరు వాచ్యగుణక్రియానిమిత్త

తే. ములఁ బదాఱు పదాఱునా నలస్వరూప, గతనిమిత్తంబులకు వాచ్యగమ్యగతులు
గానఁ బదియాఱు నగువాచ్యగస్వరూప,మరయుగమ్యస్వరూప మష్టాఖ్యయయ్యె.

క. అల హేతుఫలనిమిత్తం, బులకు న్గమ్యత్వ మైనభువి హేతుఫలం
బులు లేక రుచిర మగు నని, యలవడ గమ్యత్వ మిందు నగదిత మయ్యెన్. 65

క. కావున నేఁబదియా ఱగు, నావాచ్యోత్ప్రేక్షగమ్య యటువలెనే భే
దావహ మగుచు నిమిత్త, ద్వైవిధ్యమునందు గమ్యదాస్థితి శేమిన్. 66

క. హేతుస్వరూపఫలములు, సాతతగతి నెన్ని దెన్ని దయి యవి యు నిమి
త్తాతివ్యాప్తిఁ బదాఱుగ, నేతటి గమ్యయును నల్వదెనిమిది యయ్యెన్. 67

వ. ఇందు నేఁబదియాఱు భేదంబులం బోల్చువాచ్యోత్ప్రేక్షకుం గొన్ని నామధేయంబు
లెత్తింగించెద. ఉపాత్తగుణనిమిత్తజాతిభావస్వరూపోత్ప్రేక్షయు, నుపాత్తక్రియా
నిమిత్తజాతిభావస్వరూపోత్ప్రేక్షయు, నుపాత్తగుణనిమిత్తజాత్యభావస్వరూపో
త్ప్రేక్షయు, నుపాత్తక్రియానిమిత్తజాత్య భావస్వరూపోత్ప్రేక్షయు, ననుపాత్త
నిమిత్తజాతిభావస్వరూపోత్ప్రేక్షయు, నుపాత్తగుణనిమిత్తజాతిభావహేతూత్ప్రే
క్షయు, నుపాత్తక్రియానిమిత్తజాతిభావహేతూత్ప్రేక్షయు, నుపాత్తగుణనిమిత్త
జాత్యభావహేతూత్ప్రేక్షయు, నుపాత్తక్రియానిమిత్తజాత్య భావహేతూత్ప్రే
క్షయు, నుపాత్తగుణనిమిత్తజాతిభావఫలోత్ప్రేక్షయు, నుపాత్తక్రియానిమిత్త
జాతిభావఫలోత్ప్రేక్షయు, నుపాత్తగుణనిమిత్తజాత్య భావఫలోత్ప్రేక్షయు,
నుపాత్తక్రియానిమిత్తజాత్యభావఫలోత్ప్రేక్షయు ననఁ జతుర్దశభేదంబులఁబోల్చు
జాత్యుత్ప్రేక్ష ఇట్లు గుణోత్ప్రేక్షయుఁ గ్రియోత్ప్రేక్షయు ద్రవ్యోత్ప్రేక్షయుఁ
బరస్పరచతుర్దశభేదంబులంబొంద వాచ్యోత్ప్రేక్ష యేఁబదియాఱగు జాతి యనఁగ
సముదాయంబును గ్రియయనఁగఁ గృత్యంబును గుణం బనఁగ రూపాదియు ద్రవ్యం
బనఁగ నొకవస్తువు నగు నేతదధికాధ్యవసాయమూలంబు లగు నేఁబదియాఱు భేదం
బులకు నుదాహరణంబులొనరించినఁ జాల యగు ననుభయంబున దిఙ్మాత్రంబుగ
లక్ష్యంబులు నిరూపించెద నెట్లనిన. 68

ఉపాత్తగుణనిమిత్తజాతిభావస్వరూపోత్ప్రేక్ష.—

క. భవదీయబాహుపీఠిం, దవిలినభూదేవి యుచితధవలాభమహో
త్సవకృతకుంకుమరుచివై, భవ మన నీశౌర్యశోభ పరఁగు నృసింహా. 69

ఉపాత్తక్రియానిమిత్తజాతిభావస్వరూపోత్ప్రేక్ష.—

క. నిరుపమరణదీక్షావ్రత, విరచిత మగువిజయలక్ష్మి వేణియుఁ బోలెం
బరఁగుఁ గరాళభవత్కర, కరవాలమతల్లి యోబఘనునరసింహా. 70

అనుపాత్తనిమిత్తజాతిభావస్వరూపోత్ప్రేక్ష.—

క. నీచరణకమలనఖరుచి, వీచికలు నతారివీరవిభవము మగుడం
బ్రోచుసమీచీనసుధా, వీచికలనఁ బోల్చు నోబవిభు నరసింహా. 71

అనుపాత్తజాత్యభావస్వరూపోత్ప్రేక్ష.—

క. ఇలను సముద్రమువలె నీ, బలధూళి యొనర్చి సమదపరిపంథివధూ
విలసితబాష్పోదకముల, జలనిధిశతకము ఘటించు జగతి నృసింహా. 72

జాతిహేతూత్ప్రేక్ష.—

క. పొందిననృసింహనృపసం, క్రందనుసత్కీర్తి చేతఁగడఁగి త్రిలోకీ
మందస్మితంబుచే బలెఁ, జెందొవచెలి యంకరుచివిశేష మడంగెన్. 73

జాత్యభావహేతూత్ప్రేక్ష.—

క. రేల రవిలేమి నియతిలోఁ, త్రైలోక్యం బనియుఁ బోలె ధాత సృజించెన్
లాలితనిరుపమతేజో, నాళీకవనాప్తుఁ డైననరసింహేంద్రున్.

జాతిఫలోత్ప్రేక్ష.—

క. ప్రమదమునఁ జెలఁగుజయమయ, కమలను రంగస్థలంబు గావలసి సుమీ
క్రమమున నరసింహేంద్రుని, సమధికభుజమధ్య మతివిశాలం బయ్యెన్. 75

జాత్యభావఫలోత్ప్రేక్ష.—

క. తగవరులు జగతి మగువలఁ, దెగటార్పరు గాన నీయుద్దృప్తారాతుల్
మగఁటిమి డిగవలసి సుమీ, తగ భీరువు లగుట యోబధరణిపునరసా. 76

క్రియాస్వరూపోత్ప్రేక్ష.—

చ. అనఘ నృసింహ నీఘనజయానకజాతభయానకాధిక
ధ్వనులు గుహాగృహాగ్రముల గ్రాలఁ బ్రతిధ్వనిమేదురంబులై
తనరె దిగంతశైలములు దమ్ము నెదుర్కొనువైరికోటికిన్
నిను శరణంబు వేడు మని నేర్పున బద్ధులు నేర్పు కైవడిన్. 77

క్రియాభావస్వరూపోత్ప్రేక్ష.—

చ. భవదరిభూమిపాలకులపాలిక చెంచెత కాత్మదుర్గశ
ల్వివరముగా వచింప వనవీథి దయామతిపల్కునీనియ
ట్లవిరళమందమారుతచలాచలచారుపలాశహస్తముల్
తవిలి విదుర్చు శౌర్యగుణధామ నృసింహనృపాలశేఖరా. 78

క్రియాహేతూత్ప్రేక్ష.—

చ. మొగము ముడించెఁ గచ్ఛపము మోమరవాంచె భుజంగపుంగవుం
డగము చలింపఁగా వెఱచె నాదివరాహము మోరత్రోపునం
దెగునఁ బయోధిఁ జొచ్చె సుదతీమకరాంకనృసింహభూప నీ
జగదభినంద్యభూభరణశక్తికృతాభిభవంబుచే దలెన్. 79

క్రియాభావహేతూత్ప్రేక్ష.—

చ. నరసనృసింహ నీయశముఁ జంద్రునిఁ ద్రాసున ధాత దూఁచిన
న్నరభసవృత్తి నెత్తుడిగి సామ్యనిరూఢి వహింపలేమినో
యరయ గురుత్వహేతుమలినాంకనిరంకుశలోహటంకసం
కరమునఁ జెంచెఁ జంద్రుఁడు జగంబు మృగం బని చూచు చుండగన్. 80

క్రియాఫలోత్ప్రేక్ష.—

చ. నరనుతశౌర్యవైభవ సనాథనృసింహధరాధినాథ నీ
వరజయభేరిభాంకృతిరవంబు దివిం బరిపూర్ణమయ్యె నా
సురగణికాపరంపరకుఁ జోద్యముగా ననురూపనాయక
స్థిరపరిరంభసంభ్రమవిశేషము దెల్పఁగ నేఁగుకైవడిన్. 81

క్రియాభావఫలోత్ప్రేక్ష.—

ఉ. గందపుఁ గొండపై నివము గ్రమ్మెడిమౌక్తికనిర్ఝరీతటీ
చందనవాటిలోఁ గనకసైకతసాంద్రగుహాగృహావళిం
జెంది ఫణీంద్రకన్యలు నృసింహ నమందయశోమరందని
ష్యందము గ్రోలు చుందురు విషాగ్నివహింపఁగ లేమికిం బలెన్. 82

గుణస్వరూపోత్ప్రేక్ష.—

క. నరసింహభాగ్యసూచక, సురుచిరదృక్కోణశోణశోభ చెలంగెన్
శరణాగతభరణాయతి, కరుదుగ సాకార మగుదయారస మనఁగన్. 83

గుణాభావస్వరూపోత్ప్రేక్ష.—

క. బలశశిహారభాషలకును, బోలుపుగ మితిలేనిమాడ్కి మొలబంబై ఒ
మ్ములబంబై మెడబంబై, తలమునుకలు నయ్యె నరసధరణిపుకీర్తుల్. 84

గుణహేతూత్ప్రేక్ష.—

మ. అరయ శ్రీనరసింహుకీర్తిచయ ముద్యన్ముఖ్యనర్గోదయా
కరసామ్యంబున ఘాతపైఁ గినిసియే కాఁబోలుఁ దత్సైంధవో
త్కరసౌభాగ్యముఁ దన్మహాసనరుచిం గారించి భాషావర
స్థిరరూపం బయి తా సృజించె నరుల శ్రీకంఠసంకాశులన్. 85

గుణాభావహేతూత్ప్రేక్ష.—

క. హరిగరిమ నెగడి సత్పథ, పరిచయలంఘన మొనర్చి బ్రమియించుఁ జుమీ
నరసింహభూమిపాలుని, యరుదగుసత్కీర్తి యవినయంబునఁ బోలెన్. 86

గుణఫలోత్ప్రేక్ష.—

క. వడి నీకీర్తులఁ బోలెడి, కడిమిం దన కంగు దెలుపు గావలసి జుమీ
బిడ కడలి యొడల గ్రుంకును, వెడవిల్తునిమామ యోంబ విభునరసింహా. 87

రాజికరాంబుశీకరపరంపరలుం జెలిమబ్బుజల్లులుం
దేజముతోఁ ధరించె సుదతీమకరాంకనృసింహభూవరా. 93

ద్రవ్యాభావఫలోత్ప్రేక్ష.—

చ. తనరు నసంఖ్యవాజిగజదారుణసైన్యము తగు నాదుమ్రోల నేఁ
డెనిమిదిసైంధవేనముల నీడుగఁ దాల్చుట యెట్లటంచు నా
కినుక నభంబు లేకునికిఁ బలె శ్రీనరసింహుజైత్రవా
హిని యనిలోన నింగి కెగయించు నుదంచితరేణుపుంజముల్. 94

క. ధరవాచ్యోత్ప్రేక్ష కుదా, హరణము లివి గొన్ని కడమ యన్యకృతులయం
దరయఁగ దగు గమ్యోత్ప్రే, క్ష రచింపఁగ లేదు నేర్పు చాలమి నింగున్. 95

అతిశయోక్తి.—

క. ఉపమేయ మింతదడవక, యుపమానమె నుడువ నతిశయోక్తికవిమహా
నిపుణోక్తిమూలమై తగు, నపరిమితప్రౌఢి నదియు నైదువిధములై. 96

తే. పరఁగ సంబంధమం దసంబంధ మనఁగ, మఱి యసంబంధమందు సంబంధ మనఁగ
భేదమందు నభేద మభేదభేద, భావమును గార్యహేతువిపర్యయ మన. 97

సంబంధాసంబంధాతిశయోక్తి.—

మ. అలఘుప్రౌఢిమ నీదుదానవిభవం బాలించి యాలించి ని
చ్చలు దానస్ఫురణం బడంగె సురభూజశ్రేణికిం గలె నా
బలభిద్వారణగండకాషకలనప్రత్యగ్రలగ్నాధికో
జ్జ్వలదానం బొకవేళ గల్గు నరసక్ష్మాపాలచూడామణీ. 98

అసంబంధసంబంధాతిశయోక్తి.—

ఉ. చందనశైలసానువులఁ జాలఁ జెలంగుభుజంగబాలికా
బృందము శ్రీనృసింహవిభుఁ బేర్కొని పాడఁ దదీయగానని
ష్యందము లానువేడ్కఁ బెరయంగఁ గురంగతురంగమేగమిఁకన్
మందగతిప్రసంగములు మానవు దక్షిణగంధవాహముల్. 99

భేదాభేదాతిశయోక్తి.—

క. అగు నొకటి కర్ణభూషణ, మగు నొక్కటి కర్ణవైరిహారిచందనపుం
జిగురను నీచే చిగురుఁ, బొగ డొందుట కిదియె భేదము నృసింహనృపా. 100

అభేదభేదాతిశయోక్తి.—

సీ. అమృతమూర్తికిఁ గళంకావాప్తి యెట్లని, మిహికాంశునిఁ గళంకరహితుఁ జేయ
లోకబాంధవున కుగ్రాకార మెట్లని, భానుఁ బార్వణశీతభానుఁ జేయ

మృత్యుంజయుఁ డనఁ గేల మెడచుట్టు విస మనిన్ గరళకంఠుని సితకంఠుఁ జేయ
దలపోయ నఖిలవైనదాత కీపూలిన్య, మనుచితం బని ఘను నమలుఁ జేయ
తే. మహితభవదీయసత్కీర్తిమధురవిధుర, వక్ర మగు బ్రహ్మసృష్టి నతిక్రమించి
కమలజాండకరండంబు గడచి వెడలె, వైరిగజసింహ యోబయనారసింహ. 101

కార్యకారణవిపర్యయరూపాతిశయోక్తి —

సీ. వెస నీప్రతాపాగ్ని దెసలఁ బర్వక మున్నె, పొగయు శాత్రవరాజపురనరంబు
లలపురంబులధూమ మగ్గలింపక మున్నె, ప్రబలువైరికళత్రబాష్పవితతు
లలజలంబులు ధాత్రి నవఘళింపక మున్నె, ప్రేంఖ్యబ్బువారి యకీర్తిపంక
మాపంకసంకరం బంకురింపక మున్నె, పొడము నసత్కీర్తిపుండరీక
తే. మవుర కవిబుధశుకపికనివహనిరత, ఫలితసురుచిరసురతరుపటిమఘటన
కలితకరతలకోమలమితకరజనికర, గరిమ మనుపోచిరాజోబఘనునృసింహ. 102

సహోక్తి —

క. నిపుణత ముఖ్యాన్విత మా, నుపమేయంబును సహార్థయోగాన్విత మా
నుపమానంబును బేరసినఁ, బ్రపంచితం బగుసహోక్తి రహి నెట్టన్నన్. 103

సీ. నానారిభూనాథసేనాతతులతోనె, కటకము ల్దూఱు నీపటహరవము
భీతారిజాతాసువాతావళులతోనె, దివి కేఁగు నీచమూభవరజంబు
ధీరాతివీరారిఘోరాంగములతోనె, వడకు నీకరతలోజ్జ్వలకృపాణ
మస్త్రాదిమస్త్రాగ్రవిస్తారములతోనె, నతిఁ జెందు తావకోన్నతశరాస
తే. మహితనృపరాజ్యలక్ష్మిమృగాక్షితోనె, వేడ్కనినుఁ జెందు సంగ్రామవిజయలక్ష్మి
యనఘతరపోచిరాజవంశాబ్ధిచంద్ర, నరసుతాటోప యోబయనరసభూప. 104

వినోక్తి.—

క. సంబంధిఁ బాసి మఱియొక, సంబంధికిఁ జారుతయు నచారుతయుం బ్రా
ప్తంబుగఁ బ్రజ్ఞాధికులమ, తంబున నది యగు వినోక్తి ధరనెట్టన్నన్. 105

ఉ. క్రూరత లేనిచూపు నెలకొన్నవికారము లేనిరూపహం
కారము లేనియేపు కలకాలము వేసట లేనిప్రాపు సం
ప్రేరితయంత్రమీనతనుభేదమునన్సరి లేనితూపు ని
ద్ధారుణి నీకె పొల్చు గుణధామ నృసింహనృపాలశేఖరా. 106

అచారుతావినోక్తి.—

క. కవి లేనిరాజుకీర్తియు, రవి లేనినభంబు రూపరసభావములం
జవి లేనిభామపొందును, రవలేనివిభూషణంబు రహి నరసింహా. 107

సమాసోక్తి.—

క. ప్రకృతము విశేషణంబులు, సకలంబును సామ్యధర్మసహితము లై య
ప్రకృతముఁ దలఁపింపఁగ నది, యకృతి సమాసోక్తి యయ్యె నది యెట్లన్నన్.

క. కలకంఠరుతులఁ బిలుచును, ఫలమ్ములు చవి చూడుఁ డనుచుఁ బదములఁ బెనఁగుఁ
బలమతి పఱచు భవద్రిపు, లలనాతతిఁ గాంచి వింధ్యలతలు నృసింహా. 109

వక్రోక్తి.—

క. వేరొకవిధమునఁ బలికిన, చారూక్తికి శ్లేష కాకుసంబంధముచే
వేరొకయోజన దెచ్చిన, నారయ వక్రోక్తి యయ్యె నది యెట్లన్నన్. 110

ఉ. ఇంతి భవన్మనోజ్ఞగతుఁ డెవ్వఁ డినుం డినుఁడైన బద్మిని
కాంతుఁడొ రాజశేఖరుఁడు గా నితఁ డాతఁడు గాఁడు రుద్రుఁడో
కాంతి లలాటలోచనుఁడు గాఁడు నృసింహుఁడు మాధవుండొ ని
న్నింతట మెచ్చితిం జెలి నిజేశుఁడు మాధవుఁ డౌ శుభాకృతిన్. 111

స్వభావోక్తి.—

క. సహృదయహృదయంగమమై, మహి నున్నది యున్నయట్ల మాటల తేటల్
బహుళంబులు గాఁ జెప్పిన, మహితోక్తియె జాతి యయ్యె మది నెట్లన్నన్. 112

సీ. తల మూపి మోసులై త్రాసులై తళుకెక్కి, నిక్కి నక్కులవలె నెరసి బెరసి
గెఱకట్టి కళుకులై కెరలి పోఁకంతలై, వింతలై చెంతల విరివిఁ జెంది
జిగిదొట్టి మిట్టలై బిగువులై బుగడలై, మొగడలై నిగనిగన్నిగల నెగడి
కొన లుబ్బి గుబ్బలై గుబ్బలై యపరంజి, కుండలై కొండలై దండ నించి

తే. దొరసి యొండొంటి నొరసి క్రిక్కిఱిసి మెఱసి
యగణితస్ఫూర్తి మొగమున కెగయు నీదు
వలుదవలిగుబ్బచన్నులు లోవలపులాఁడి
నేఁడు నరసింహుకౌఁగిట నెరపఁ గలిగె. 113

వ్యాజోక్తి.—

క. తేజరిలు వేడ్కతోన, వ్యాజసముద్భూతమైన వస్తువు నెలమిన్
వ్యాజంబు చేసి డాఁచిన, వ్యాజోక్తి యనంగఁ బొల్చు నది యెట్లన్నన్. 114

క. బాలామణి నరసింహున్, బాలాగ్రణిఁ జూచి ప్రమదబాష్పావృతయై
లీలాసౌధసముత్థిత, కాలాగురుధూప మెంతఘన మని పల్కెన్. 115

మీలనము:—

క. అననిం బ్రబలం బగువ, స్తువుచే వస్త్వంతరంబు సొరిది నడఁగినం
గవులమతంబున మీలన, మవునది యన్వర్థ మగుచు నది యెట్లన్నన్. 116

శా. నీధాటీవిగలద్బలోద్భలభటానీకోదయద్భీతిచే
బాధాహేతువనోగ్రజంతుభయముం బాటింపకాత్మ న్రిపు
క్ష్మాధీశాంగన లద్రికందరల వెల్గంచు న్భుజంగస్ఫటా
సాధూద్యన్మణిపంక్తిఁ గప్పుదురు దోశ్శక్తి న్నృసింహాధిపా. 117

సామాన్యము.—

క. అవిరళగుణసామ్యంబున, నవని న్వస్త్వంతరంబునం దేకం బై
ప్రవిమలవస్తువు మెఱసిన, నవు నది సామాన్య మనఁగ నది యె ట్లన్నన్. 118

క. నీకీర్తికాంతలోపల, శ్రీకంఠుం డేక మైన శివుఁ గానక యా
నాకనది జలధి కేఁగుం, బాకారిసమాన యోబపార్థివునరసా. 119

తద్గుణాతద్గుణములు.—

క. తనగుణము విడిచి యన్యము, ననఘుగుణముఁ గొనుట తద్గుణాఖ్య మొరుగుణం
బనయము హేతువు గలిగియు, నెనయమియు యతద్గుణాఖ్య మివి యె ట్లన్నన్. 120

తద్గుణము.—

ఉ. కానల కేఁగి నీవిమతకాంతరలోచన ప్రాణనాథుఁడుం
దాను భుజింపఁగా ఫలవితానము గోసెద నంచుఁ బోయి నా
నానిరవద్యకోకనదనవ్యసఖాంగుళిపాటలాంశురే
ఖానిబిడంబు లైనకసుగాయలె కోయు నృసింహభూవరా. 121

అతద్గుణము.—

చ. బలరిపుభోగ యోబనరపాలనృసింహ భవద్యశంబుచేఁ
దెలుపగు నిందులాంఛనము దెల్పగుఁ బ్రాక్తనభోగిభోగము
తెలుపగు రుద్రకంధరము దెల్పగుభారతకొప్పు గాని త్వ
ద్బలరిపుదుర్యశోరుచివితానము తెల్పయి యుండ దెన్నఁడున్. 122

విరోధాభాసము.—

క. అమర విరోధం బాభా, సము గాఁగ విరోధ మయ్యె జగతి నదియునుం
గ్రమమునఁ జాత్యాదివిభే, దములబహుత్వంబుఁ జెంది తగు నె ట్లన్నన్. 123

తే. జాతి జాత్యాదికముతోడ జగతిఁ గ్రియ క్రియాదికముతోడ గుణము గుణాదితోడ
ద్రవ్యమున ద్రవ్యము విరోధంబుఁ జెందఁ, బది విరోధంబు లగువీనిఁ బదిలపఱుతు.

జాత్యాదివిరోధక్రియాదివిరోధములు.—

సీ. ధారాధరం బయ్యుఁ దనరు నీకాంక్షేయ, మనతవాహిని కజీవనద మయ్యె
కమలాకరం బయ్యె నమరు నీశౌర్యంబు, ఘనరాజహంసభీకరతఁ దాల్చె
నీదంధ్రగతిమహావారణం బయ్యె నీ, సత్కీర్తిహరిఘటాసఖ్య మొందె
నవనిఁ బ్రభానిధి యయ్యె నీసేన్మను, జైవాతృకత్వంబు సంఘటించె

తే. ధర్మకర మయ్యుఁ బ్రతిపక్షధర్మభేది
నరనుతవిహార మయ్యుఁ గర్ణప్రమోద
శీల మయగోత్రభృతి యయ్యు జిష్ణుపగుచుఁ
జెలఁగునీబాహుయుగము నృసింహభూప. 125

గుణాదివిరోధద్రవ్యవిరోధములు.—

మ. తలిరుంబోఁడి సరాగ యయ్యె ఘనశోభం బొందు సువృత్తస్తనా
చలభారాసహ యయ్యె దా నచల యౌఁ జర్చింపఁగా నార్యయై
చెలువం బందియు నన్యభాగ యగు నీచేతోజశస్త్రాహతి
న్నలినాక్షీమణి నేలు మింక నరసేంద్రా సాంద్రతేజోనిధీ. 126

విశేషము.—

క. ధారణి నాధేయము నా, ధారముగా నొకట నేకతరకలితముగా
సారెకు నశక్యకరణం, బారూఢముగా విశేష మగు నెట్లన్నన్. 127

ఆధారరహితాధేయము.—

చ. సురమున శ్రీనృసింహుఁ డలిదుర్మదవీరవిరోధపంక్తిపై
శరభసవృత్తి నత్తలము సాఁపఁ బ్రదీప్తము లయ్యెఁ దన్మహా
మరకతపుష్యరాగనవమౌక్తికవిద్రుమనీలకాంతిచే
సురపద వీథిపై జనులమాడ్కిఁ గభిత్తికచిత్రకర్మముల్. 128

ఏకానేకగోచరము.—

క. కలఁడు గలఁ డన్నచోటం, గలుగు నృసింహుఁ డవుగానఁ గానల గిరులం
గలలోన బ్రోలఁ బిమ్మట, నలఘుస్థితి నీవ యగుదు నరికి నృసింహా. 129

సీ. దారుణాఖండమార్తాండమండలము ను, ప్పొంగి గుటుక్కున మ్రింగవచ్చు
గంభీరఘుమఘుమారంభసంరంభము, గ్ధపయోధి చెంగున దాఁటవచ్చుఁ
జండికాజానేయగండప్రకాండము, ల్వ్రేఁకఁ జరాలున వ్రయ్యవచ్చుఁ
గుటిలోగ్రశతకోటికోటిసంఘాటము, ల్కసిసి ఘుణిల్లునఁ దునుమవచ్చుఁ

తే. గానిపశ్యదళీకభీకరదృగగ్ర, జాగ్రదనలోజ్జ్వలజ్వాలజాలజటిల
గురుభుజాశౌర్య నినుఁ జెనకుం దరమె యరుల, కౌబలేంద్రనినారసింహక్షితీంద్ర.

అధికము.—

క. ఆధారం బల్పం బై, యాధేయం బధిక మైన నది యల్పం బై
యాధారంబును నధికం, బై ధర రంజిల్ల నధిక మగు నెట్లన్నన్. 131

అధికాధేయము.—

క. ఘనరోమకూపవాతా, యనముల కనాపంక్తు లగునజాండంబులచేఁ
దనరు హరికుక్షి నడఁగక, యనఘాబ్జాతవడలై నీదుయశము నృసింహా. 132

అధికాధారము.—

క. నీదునిరవద్యకీర్తిమ, హోదుగ్ధపయోధిలోన నాదిమరాజ
ప్రాదుర్భూతయశంబులు, ప్రోదిం బుద్బుదములట్లు పొల్చు నృసింహా. 133

విభావనావిశేషోక్తులు.—

క. కారణము లేక కార్యము, ప్రారూఢం బైన నది విభావన పెక్కు
ల్కారణము లయ్యుఁ గార్యము, చేరక యుండుట మహి న్విశేషోక్తి యగున్.

విభావన.—

సీ. నలినారి లేనివెన్నెలలు రాత్రులు లేని, తారలు లత లేనికోరకములు
కొలను లేనిసితాబ్జములు స్వాతిచినుకులు, లేనిముత్తెము లేటు లేనినురువు
లలను వెల్లురు లేనివెడమబ్బులు హిమాద్రి, లేనిమంచులు వార్ధి లేనిసుధలు
గని లేనివజ్రము లంధాద్రి లేనిగం, ధములు పాదము లేనితారవితతు

తే. లౌర నీకీర్తిరుచులు మహానుభావ, భానుజాకార కారుణ్యాభాసమాన
మానవరురాజ రాజన్యమకుటనిహిత, చరణరాజీవ యోబభూవరనృసింహ. 135

విశేషోక్తి.—

క. అని నీచాపఘనాఘన, ఘనము శరోత్కరముఁ గురియఁ గపటాహితరా
డ్వనితలవ నెట్టిచోద్యమొ, యను నొందవు కంకణంబు లౌబళనరసా. 136

అసంగతి.—

క. నేరుపుతోఁ గార్యంబును, గారణమును భిన్న దేశగతములు గాని
ధారణిలోన నసంగతి, యై రంజిలు నందు సుకవు లది యెట్లన్నన్. 137

క. అనిలోన నీభుజాగ్రం, బనుపమతరవారిధార నందిన నేలా
యనయంబుఁ దాము వడఁకుదు, రనతారులు శ్రీనృసింహ యతిబలసింహా. 138

విచిత్రాన్యోన్యములు.—

క. స్వవిరుద్ధఫలంబునకై, యవిరళయత్నము విచిత్ర మన్యోన్యము భూ
ష్యవిభూషణభావంబునఁ, దవులుట యన్యోన్య మయ్యె ధర నెట్లన్నన్. 139

క. నతిఁ జెందుమ రున్నతికై, ప్రతీపభూపతులు నీపుఃభవనాగ్రబహిః
స్థితిఁ జెందుదురు గృహాంత, స్థితికై నరసింహ శౌర్యజితనరసింహా. 140

అన్యోన్యము.—

క. లలన నృసింహునిఁ జెందెడి, తలపున మైదోడవు లిడఁగ దనులత చెలఁగెఁ
గలితవిభూషణములచే, లలితవిభూషణము లంగలతచేఁ జెలఁగెన్. 141

విషమము.—

క. అవిరళవిరుద్ధకార్యో, ద్భవమున నర్థాంకురాభిపతనవిధానం
బు విరూపఘటన మనఁగా, నవనిం ద్రివిధంబు విషమ మది యెట్లన్నన్. 142

విరుద్ధకార్యవిషమము.—

క. కాలాహినీల మగుని, వా లాహవభూమియందు వఱలుచు రిపుభూ
పాలాననవై సర్ణ్యవి, భాలాధ మొనర్చు నోబపార్థివనరసా. 143

అనర్థవిషమము.—

చ. అమరుభిపత్ప్రతాపతపనాతప మంబరవీథిఁ బర్వఁ గా
సమదవిరోధిభూగమణచంద్రముఖోదనారవిందముల్

క్రమమున వాగ్మ మొందమియ కౌ దనయంబు ద్విగంబునిర్ఝరీ
హిమజలరాశితంబు లగు నెంతయు శ్రీనరసింహభూవరా. 144

విరూపసంఘటనము.—

సీ. హయగజారూఢు లై యలపరాజన్యపుం, గవు లేడఁ గవు లేడఁ గంబుకంఠి
ఘనభోగభాగ్యసంగతు లై నసుమిత్రి కే, నరు లేడ నరు లేడఁ జంద్రవదన
సౌధవీథికలలోఁ జరియించుముప్ప్రియ్యకో, ములు లేడ నులు లేడఁ దలిరుబోఁడి
చీనిచీనాంబరశ్రీఁ జెందు బాలికా, వలు లేడ వలు లేడ వామనయన

తే. యనుచు నీచాడి కోడి కాంతవెనఁ బడిన, ప్రతిభూపాలకులదురవస్థఁ జూచి
కాంతతోఁ బల్కు వింధ్యపక్కణకిరాతుఁ, డరిజయాటోప తోరగంటిసరసభూప.

సమము.—

క. అనురూపము లగువస్తువు, లనయము నెనయంగ నది సమాలంకృతి యై
ఘనత రసజ్ఞులమతమునఁ, దనరుం గావ్యంబులందు ధర నెట్లన్నన్. 146

చ. అలరు రతిప్రతీశు దమయంతి నలు న్నలువొంద ముందుగా
నలువ సృజించి యంతుకతనం దనచే యభికెల్లఁ గీతి నే
ర్పలవడ నోలతాంగి నరసాధపు నిన్నును గూర్చి ప్రేమసం
కలితను గాఁగ దంపతులఁ గా నొనరింపఁగఁ బోలు మెచ్చితిన్. 147

తుల్యయోగిత.—

క. ప్రకృతంబులకైనను న, ప్రకృతంబులకైనఁ దుల్యభావము గలుగం
బ్రకట మగుఁ దుల్యయోగిత, యకలంకౌపమ్యగమ్య మై యెట్లన్నన్. 148

ప్రకృతతుల్యయోగిత —

క. నరసింహరాజశేఖర, నరనుత మగునీ మవితరణంబును రణముం
నిరతస్వార్థ్యంబుగఁ గ్రి, మ్మఱ దేహి యనంగనీక మనుచుం బరులన్. 149

అప్రకృతతుల్యయోగిత —

క. కొండలు రంభాదులచనుఁ, గొండలు వడి నదరు చుండు ఘోరాజుల నీ
చండజయపటహరవము ల, జాండంబులు నిండ నోబయప్రభునరసా. 150

దీపకము.—

క. ప్రకృతము లప్రకృతంబులుఁ, బ్రకటంబుగఁ గూడి తుల్యభావముఁ జెందన్
సుకవీంద్రులమతమున దీ, పక మగు నిది గమ్యసామ్యపర మెట్లన్నన్. 151

క. ధారణి సదాకీసన్నుత, సారస్యం బగుచు విమలజలజము రాకా
నీ తేజమై రిబింబము, నిరద్వ్యయశంబుఁ బోల్చు నెమ్మి నృసింహా. 152

ప్రతివస్తూపమ.—

క. వేర్వేఱ వాక్యయుగమునఁ, బర్వనసాధర్మ్య మమరఁ బ్రఖ్యాతం బై
యుర్విం బ్రతివస్తూపమ, సర్వజ్ఞులమతమునందుఁ జను నెట్లన్నన్. 153

క. రవి యొకఁడె ధురంధరుఁ డౌ, కవిసి తమోవితతి నడఁపఁ గవిదైన్యతమో
నివహంబు నడఁప నీవే, యనిని హూర్వహుండ వోబయ ప్రభునరసా. 154

దృష్టాంతము.—

క. బింబప్రతిబింబత్వము, నం బరఁగినవాక్యయుగమునం గలసాధ
ర్మ్యంబు చెలంగిన దృష్టాం, తం బగు నది కృతులయందు ధర నెన్నన్. 155

క. అసదసురవిసరవిశసన, రసవిస్మరసాహసుండు రాముఁడె ధరలో
నసమసమరతలసహుఁడా, రిసమూహవిభేది వీవె శ్రీనరసింహా. 156

నిదర్శనాలంకారము —

క. ధర నన్వయంబు గూడక, గరిమ న్సామ్యంబు నెచట గమ్యముఁ జేయం
బరఁగునది నిదర్శన యన, నిరవొందును గృతులయందు నిది యెట్లన్నన్. 157

క బలనదరిరాజసేనా, జలధిక జీవనము గ్రోలి జలధరశోభా
విలసనము దాల్చె నీయసి, యలఘురణోత్సాహనరస యాబళనరసా. 158

వ్యతిరేకము.—

క. ధర నుపమానముకన్నను, నరు దగు నుపమేయ మధిక మౌ నన సామ్యం
బురుభేదకారణం బై, యిరవుగ వ్యతిరేక మయ్యె నిది యెట్లన్నన్. 159

సీ. బహుతరాశాభ్రాంతి బయలు ప్రాకక యున్నఁ, గువలయద్వేషంబుఁ గోరకున్న
పీటితమ్ములవిరివోటు సేయక యున్న, దోషాభిభూతుఁ డై తొలఁగకున్న
జగతి నందఱకును బగ లొనర్పక యున్న, వారుణీసక్తిని బాఱకున్న
ద్విజరాజపరిభవోద్వృత్తి చేకొనకున్న, నరసుల నింకింపఁ జాలకున్న

తే. సాటి యగువిశ్వవినుత శశ్వత్ప్రతాప, వైభవద్వస్తమస్వారవైరివీరుఁ
డైనయోబయనరసింహు నమితభువన, ఘనభృతతేజమున కబ్జబాంధవుండు. 160

శ్లేషము.—

క. ప్రకృతము లప్రకృతంబులు, ప్రకృతాప్రకృతములు శబ్దపాలువమాత్ర
ప్రకటితసామ్యముఁ జెందిన, నకలంకశ్లేష మయ్యె నదియును మూఁడౌన్. 161

క. నిరతము శ్లిష్టవిశేష్యత, నరు దందును ప్రకృతములును నప్రకృతములున్
ధర నశ్లిష్టవిశేష్యము, లరయం బ్రకృతాప్రకృతము లవి యెట్లన్నన్. 162

ప్రకృతశ్లేషము.—

క. పరిణతగుణభరితము లై, నిరుపమశరశాస్త్రకలన నిర్నిద్రము లై
యిర వగునీధర్మంబులు, నరనుత యోబక్షితీంద్రునరసింహనృపా. 163

అప్రకృతశ్లేషము.—

క. అసదృశకాష్ఠాశ్లేషో, ల్లసితుల నుగ్రకరయోగలక్షితులవిభా
వసుల నగు నీదుతేజో, విసరము నరసింహయోబవిభునరసింహా. 164

ప్రకృతాప్రకృతశ్లేషము.—

క. అరిదరకరుఁ డై సుమనో, వరభరణధురీణుఁ డై యవారితలక్ష్మీ
స్థిరవాసభాసురుం డై, నరసింహుఁడు వొల్చు నాదినరసింహుఁ డనన్. 165

పరికరము —

క. సాకూతము లై సఫలత, చేకొన్న విశేషణములు చెలఁగఁ బరికరం
బై కృతుల వెలయుచుండు మ, హాకవిసంస్తుత్య మగుచు నది యెట్లన్నన్. 166

సీ. దర్పితాహితనృపోత్తములు నిన్నెదిరింపఁ, గలరె ధీరోత్తమగండబిరుద
విమతకీర్తిప్రతాపములు నీచే సమ, కట్టునే యుభయరగండబిరుద
యరిమహాతాటంకగరిమంబు నీచేతఁ, గలుగునే గండరగండబిరుద
పరిపంథిగంధసింధురపంక్తి నీమ్రోల, నుండునే గండభేరుండబిరుద

తే. యరుణపరిణతధామ రామాభిరామ, రామణీయకనిర్జితప్రసవబాణ
బాణసాహిత్యపరిపాక పాకవైరి, విభవసౌభాగ్యయోబభూవిభున్నసింహ. 167

ఆక్షేపము.—

క. ధర నిష్ట మపరమార్థ, స్ఫురణం గా దన ననిష్ట మున పరమార్థ
స్ఫురణ విధింపఁగ రెండై, యరయఁగ నాక్షేప మగు నది యెట్లన్నన్. 168

ఇష్టనిషేధాభాసము.—

సీ. మదిలోనఁ బాయకుండుము నన్నుఁ బనునుక్తి, నీసొమ్ము నన్న గాణిక్యవృత్తి
నినుఁ బాసి నిలువలే నన నసంభావ్యంబు, పతి వీ వనఁగ నభఃప్రసవవాంఛ
యతనుఁడు గారించు నన నసాక్షికసూక్తి, చలిగాలి వేఁ డన్న జనవిరుద్ధ
మెలమి నిచ్చటికి రావలయు నన్న మదోక్తి, చను దెంతు నే నన్నఁ జాపలంబు

తే. వెలయఁ ద్వదధీన యగునన్ను వేఁచు నలక, లాధరుం డన్న భవదుపాలంభసరణి
గాన నేయుక్తులు నెఱుంగఁ గరుణఁ జూడు, సరసగుణహార యోబయనరసధీర.

అనిష్టవిధ్యాభాసము.—

చ. అలుగఁగ నేల మీరు వసుధాధిపు లెన్న స్వతంత్రు లై మము
వల దనవచ్చు మీమనసు వచ్చినచోటికి నేఁగుఁ డేఁగిన
న్నెలకొని నీప్రియాంగనకు నీకును మాఱ్మోన.లేకయుండ న
ర్మిలి సుసరంబు గాఁగ నొనరించెదఁ గాక నృసింహభూవరా. 170

వ్యాజస్తుతి —

క. సతతంబు నిందచేతను, స్తుతియుఁ స్తుతిచేత నింద చొప్పడ వ్యాజ
స్తుతి యై చెలుఁ వగుఁ గృతులం, దతులితకవివినుత మగుచు నది యెట్లన్నన్. 171

నిందాకృతిస్తుతి.—

సీ. నెఱిజీవనము లేక నింగిపై భ్రమియించు, మత్స్యంబు దనుము టే మాటవాసి
త్రిజగతీమాతవాగ్దేవిభండారంబు, చూఱగాఁ గొనుటయే సుగుణితనము

వేడినవారికి వెండియు నొకమాఱు, విత్త మీకుంటయే వితరణంబు
అలయనాదిప్రవాహము లైనయేఁట్లవం, కలు దిద్దుటే వివేకంబు కలిమి
తే. వఱలు నీకీర్తి ద్విజరాజవైభవంబు, లపహరింపఁగ నీయాజ్ఞ యలరు టెంత
పోచిరాజాన్వయాంభోధిపూర్ణచంద్ర, నరనుతాటోప తోరగంటినరసభూప. 172
స్తుతినింద.—
క. అసమరణరంగముల నీ, యసినటి నటియింపఁ గరుల హయల న్విఁకలన్.
వెస నొసఁగు నార యెంతటి, రసికుఁడు నీవైరి యోబరాజన్నసింహా. 173
అప్రస్తుతప్రశంస.—
క. క్షితి నప్రస్తుతమునఁ బ్రస్తుతవస్తువు గమ్య మగుచు సొం పొందిననీ
శ్రుతులఁ దలపోయ నప్ర, స్తుతప్రశంసాఖ్య మయ్యెఁ దది యె ట్లన్నన్. 174
క. ననలం మొనలెత్తెఁ దేసెలఁ, చినికెం జిగురాకు గంటెఁ జెదరె నలితతుల్
చనువున నిపూఁడీఁగకు, ఘన మైనన్నసింహుపొందు గలుగఁగఁ బోలున్. 175
పర్యాయోక్తి.—
క. ప్రస్తుతకార్యస్తుతిచేఁ, బ్రస్తుతకారణము దోఁపఁ బర్యాయోక్తం
బస్తోకసుకవికావ్య, ప్రస్తుత మై చెలఁగు దుండు రహి నెట్లన్నన్. 176
ఉ. చక్కెర పెట్టవే వికచసారసలోచన మాట జేర్పవే
చొక్కపుగుబ్బలాఁడి ననుఁ జొప్పడఁ బాణితలంబుఁ జేర్పవే
చెక్కులనిగ్గులాఁడి యని చిల్కలుపల్కు నృసింహపూర్వపు
న్మక్కప నీవిరోధినృపమందిరచిత్రవధూపరంపరన్. 177
ప్రతీపము.—
క. ఉపమేయమె చాలు న్ధర, నుపమానం బేల యనఁగ నొనరుఁ బ్రతీపం
బపరిమితసుకవికృతులం, దపారవిస్ఫూర్తిఁ జెంది యది యె ట్లన్నన్. 178
సీ. సత్పథక్రమకళాచాతురి నెఱపదో, కమలాధికామోదకరము గాదొ
వివిధచక్రానందవిభవం బొనర్పదో, సతతంబు నుదయసంగతము గాదొ
యిలమహాగ్రహరాజజృంభణం బలమదో, యమితదోషోన్మేషహరము గాదొ
మహితగాంగేయధామస్ఫూర్తిఁ జెలఁగదో, యచ్యుతోగ్రాకారహారి గాదొ
తే. నీప్రతాపంబు దనవలె నిఖిలతమము, నడఁపఁగా లేదొ తా నేల యరుగుదెంచుఁ
గుంటిసారథితో నల్ల కుముదవైరినరనుతాటోప యోబయనరసభూప. 179
అనుమానము.—
క. భువిసాధనసంపదచే, నవిరళవిస్ఫూర్తిసాధ్య మనుమేయముగా
వివిధశ్లేషవిశేషా, ద్యవియుత మనుమాన మయ్యె నది యె ట్లన్నన్. 180
సీ. కమలాక్షుఁ డీమేటి గాఁబోలుఁ గాకున్నఁ, గరముల శంఖచక్రములు గలవె
కమలారి యీరాజు గాఁబోలుఁ గాకున్న, సకలకలావిలాసములు గలవె

గమలాప్తుఁ డీప్రోడ గాఁబోలుఁ గాకున్న, నధిగతమండలవ్యాప్తి గలదె
కమలజుం డీస్వామి గాఁబోలుఁ గాకున్నఁ, జతురాననవచఃప్రశస్తి గలదె
తే. యనుచుఁ గొనియాడుదురు నిన్ను నంగవంగ, మాళవావంతి గౌళ నేపాళ చోళ
కుకుర కురు పాండ్య శక ముఖక్షోణిపతులు, నరసుతాటోప యోబయనరసభూప.

కావ్యలింగము.—

క. హేతువు వాక్యార్థం బై, యాతతవిస్ఫూర్తితోఁ బదార్థంబును నై
ఖ్యాతిఁ గనఁ గావ్యలింగం, బై తగు సత్కృతులయందు నది యెట్లన్నన్. 182

వాక్యార్థహేతుకము.—

మ. అరుదై పొల్పగు పోచిరాజునరసింహా యన్న యష్టాక్షరీ
వరమంత్రం బది యెల్లకాలము నరు ల్వాక్రువ్వ సిద్ధించుఁ బో
కరు లాందోళిక లశ్వము ల్విభవము ల్గ్రామంబు లత్యుజ్జ్వలాం
బరము ల్సొమ్ములు పల్లకీ ల్పరిణయప్రారంభసంరంభముల్. 183

పదార్థహేతుకము.—

క. గురునఖదళితప్రతిమా, కరిచిత్రితభిత్తిగళితఘనమణిపీఠా
పరితోషయుతము లై నీ, యరిపురములఁ గినుక మాను హరులు నృసింహా. 184

అర్థాంతరన్యాసము.—

తే. మహివిశేషంబుచేత సామాన్యమును బ్ర, సక్తసామాన్యమున విశేషము సమర్థి
తముగ నర్థాంతరన్యాస మమరుచుండు, నెలమి రెండువిధంబు లైయ ట్లటన్న. 185

విశేషసమర్థితసామాన్యార్థాంతరన్యాసము.—

క. విమలాత్ముఁ డెచట నుండిన, విమలుం డగు నె ట్లఁటన్న, వినుము సురాగా
రమునఁ జరించియు నీయశ, మమలస్థితి గాదె యోబయప్రభునరసా. 186

సామాన్యసమర్థితవిశేషార్థాంతరన్యాసము.—

చ. జలనిధిరాజకన్య కనుసన్న మెలంగుచు నుండు వాణియున్
మెలఁగును మాటలోన నెలమిం జెయిసన్నఁ జరించుఁ గీర్తి నీ
లలితభుజోపగూహననివాసము మానదు ధాత్రి సద్గుణో
జ్జ్వలనరసింహ మంత్రబలవంతుల కింతులు చిక్కు టబ్రమే. 187

యథాసంఖ్యము.—

క. సమముగ నేవరుసఁ బదా, ర్థము లుద్దిష్టంబు లయ్యెఁ దగ నాపర్యా
యమున ననూద్దిష్టము లై, యమర యథాసంఖ్య మయ్యె నది యెట్లన్నన్. 188

చ. వరకరుణాధరాభరణవైభవసద్గుణబుద్ధిచాతురీ
పరమవిభుత్వపావనవిభాబలధైర్యవిజృంభణంబులన్
వరుస హరిం గిరిం గలశవార్నిధి గిర్నిధి శూలిఁ గీలి నా
కరిఁ గిరి గెల్తు వౌర త్రిజగన్నుత శ్రీనరసింహభూవరా. 189

అర్థాపత్తి.—

క. వరుస నొకానొకవస్తువు, గిరికొన వస్త్వంతరంబు కిముతన్యాయ
స్ఫురితంబై చనుదేఱఁగ, ధర నర్థాపత్తి యయ్యెఁ దగ నెట్లన్నన్. 190

సీ. అమరశైలము చిన్న మంతగాఁ దలపోసి, యాశాచలము దార మెత్తఁ జేసి
వెలయ మంథానాద్రి వేళ్లతోఁ బెకలించి, మైనాక మబ్ధిలోఁ మ్రగ్గఁ జేసి
యనుపమావంధ్యవింధ్యస్ఫూర్తి నిలఁ బ్రామి, మలయాగ మూర్వికి వెలి యొనర్చి
యల క్రౌంచగిరికి రంధ్రాన్వేష మొనరించి, వలిగుబ్బలికి వింత వడఁకు గూర్చి
తే. యడరు నీధైర్య మనినచో నపరగిరులు, సాటిరా వని మఱివేఁచాల నేల
పోచిరాజాన్వయాంభోధిపూర్ణచంద్ర, వైరిగజసింహ యోబయనారసింహ. 191

పరిసంఖ్య.—

క. తలఁపఁగ నొకటి యనేక, స్థలముల సంబంధసంగతం బగునెడలం
బలిమి నొకయెడనె నిలుపుట, వెలయుం బరిసంఖ్య యగుచు విను మెట్లన్నన్.

సీ. అంద మై త్రిభువనానంద మై జితకుంద, బృంద మై నభమున బెరయు నెద్ది
పొంక మై భృతరక్తపంక మై సమరని, శ్శంక మై వినుతింపఁ జాలు నెద్ది
తోర మై దానైకధీర మై సజ్జనా, ధార మై ధారణిఁ దనరు నెద్ది
తండ మై చండిమాఖండ మై సంభృతా, జాండ మై దండి మై నలరు నెద్ది
తే. వినుము నీకీర్తి నీభుజాన్వితకృపాణి, నీకరము నీరుచియ కాని నెఱయఁ గాదు
విధుపాడుపుగాదు పవిగాదు వేల్పుమ్రాను, గాను రవిబింబ మోబభూకాంతనరస.

ఉత్తరము.—

క. ఎత్తఱి నున్నేయం బౌ, నుత్తరమునఁ బ్రశ్న మదియు నుత్తరము వెస
న్నొత్తమయి పొల్చు నెత్తఱి, నత్తఱి నుత్తరము నెగడు నది యెట్లన్నన్. 194

ఉత్తరోన్నేయప్రశ్నోత్తరము.—

సీ. అలరారు పూఁదీవ యని తలంచితిఁ గాని, యబల నీతనువల్లి యగుట యెఱుఁగ
నాలోలపల్లవం బని భ్రమించితిఁ గాని, చెలువ నీచేసన్న సేయు టెఱుఁగ
నలిబాలికాజాల మనుచుఁ జూచితిఁ గాని, సుదతి నీచికురము లైదవు టెఱుఁగ
పల్లకోకిలాలాప మనుచు నుండితిఁ గాని, పడఁతి నీవెలుఁ గెత్తి పలుకు టెఱుఁగ
తే. నలుక చాలింపు మనుచు నీయహితనృపతి, తావకోద్భటధాటికిఁ దల్లడిల్లి
యడవులకు నేఁగి కులకాంత నాదరించు, నరనుతాటోపయోబయనరసభూప.

ప్రశ్నోత్తరమాలికోత్తరము.—

ఉ. ఎవ్వఁడు దేవతాగురుఁ డహీనశయానుఁ డనక్రవిక్రముం
డెవ్వఁడు రామభద్రుఁడు మహీవలయైకధురాధురంధరుం

డెవ్వఁడు భోగిభర్త జగదేకవిజృంభితదానదీక్షితుం
డెవ్వఁడు పోచిరాజునరసేంద్రుఁడె వార్ధిపరీతమేదినిన్. 196

వికల్పము.—

క. సమబలయుతవస్తువులకు, నమితవికల్పం బొనర్ప ననఘాలంకా
రమతజ్ఞులమతమున నది, యమరు వికల్పం బనంగ నది యొట్లన్నన్. 197

సీ. అలఘుకాంచనమయస్థలనివాసము మేలో, కాంచనస్థలవాసకలన మేలో
పుండరీకంబులదండ నుండుట మేలో, పుండరీకంబులదండ మేలో
మహనీయవాహినీమధ్యసంస్థితి మేలో, వాహినీశ్వరమధ్యవసతి మేలో
మహిషసహవాసవిహరణంబులు మేలో, మహిషీసహవాసమహిమ మేలో
తే. శైలకటకాశ్రయంబులు మేలొయతని, యంఘ్రికటకాశ్రయము మేలొయధిపులార
యనుచు నిశాత్రవులమంత్రులనునయింతు,రరిజయాటోప తోరగంటినరసభూప.

సముచ్చయము.—

క. మిగుల గుణక్రియ లెయ్యెడ, యుగపత్ప్రాప్తంబులుగ సముచ్చయము కృతిం
బొగడఁ దగుఁ ద్వివిధంబై, యగణితకవివినుత మగుచు నది యొట్లన్నన్. 199

గుణసముచ్చయము.—

క. నరసింహశౌర్యశోభా, స్ఫురణంబున జగము లెల్ల శోణము లయ్యెన్
బరరాజవదనవితతులు, హరినీలనిభంబు లయ్యె ననవరతంబున్. 200

క్రియాసముచ్చయము —

చ. అలకలు ముట్టి ముట్టి జనునాంబరపంక్తికిఁ గిట్టి కిట్టి గు
బ్బలు గతిఁ బట్టి పట్టి కరపల్లవము ల్వలి వెట్టి పెట్టియుం
జెలు నగుతారహారములు చిక్కులు వెట్టున్నృసింహ నిద్విష
ల్లలన వనాలి కేఁగ నిట లక్షణలక్ష్యము లై మహీజముల్. 201

ద్వితీయసముచ్చయము.—

క. పాయక ఖలేకపోత, న్యాయమున ననేకకారణము లొకకార్యం
జేయెడ సాధింపఁగ నుత, మై యపరసముచ్చయాఖ్య మగు నె ట్లన్నన్. 202

క. శూరతయును ధీరతయును, దారతయు గభీరతయును ధార్మికతయు నీ
కారణజన్మస్ఫురదవ, తారము సూచించె నోబధరణిపునరసా. 203

సమాధి.—

క. కారణ మొక్కటి కార్యము, ధాటిణి సాధింపఁ గాక తాళి నయమునం
గారణము వేఱొకటి రా, నారూఢిసమాధి యయ్యె నది యొట్లన్నన్. 204

చ. అనిమొన శ్రీనృసింహవసుధాధపుత్రప్రచమూసమూహముం
గనుఁగొని యద్భుతం బొదవ ఖానపఖీరులు ప్రేళ్లు నోళ్లకుం

జొనుపఁగఁ గాక తాళనయశోభఁ దదీయముఖాంగుళీనివే
శనములు ప్రాణరక్షణవిచారధురీణము లయ్యె వాఁకిన్. 205

భావికము.—

క. క్షితిలోన నతీత మనా, గతమును బ్రత్యక్షమువలెఁ గనుపట్టుట న
ద్భుతనిరుపమార్థ కథనం, బతిశయముగ భావికాఖ్య మగు నె ట్లన్నన్. 206

మ. పరపల్లావిభవంబు దప్ప భుజగప్రాకంబుగా సింగిరాట్
గురుపక్షద్వితయంబు గాఁగ నరసక్షోణీశ్వరారూఢ సౌ
తురగోత్తంసము నిందిరాహృదయనాథుం డాత్మప్రత్యక్షబం
ధురపక్షీంద్రనిలీలఁ జూచు నహితస్తోమంబు భీమంబుగన్. 207

ప్రత్యనీకము.—

క. పగవాఁడు సమర్థుఁడుగా, మగఁటిమి వెస నతనిమీఁద చూపక్కొన కిల నా
పగవానిహితుల నొంచుట, యగుఁ గృతులం బ్రత్యనీక మన నె ట్లన్నన్. 208

క. నీదురవగాహశౌర్యము, భేదింపఁగ లేక విమతపృథివీశుఁ డనిన్
భేదించు నృసింహాధవ, న్నే గురథయదప్రతాపమిత్రు నిమిత్రున్. 209

వ్యాఘాతము.—

క. ఒకఁ డొకటిచేత నొకపని, యకలంకతఁ జేయ దాని నాహేతువుచే
నొకఁడు మఱి వేఱె చేయఁగఁ, బ్రకటవ్యాఘాత మెన్నఁబడు నె ట్లన్నన్. 210

క. రాజీవబాంధవుఁడు నిజ, తేజమున నొనర్చె జగతీతాపమున
వ్యాజవిరాజితతేజో, రాజి న్హరియింతు వోబరాజునృసింహా. 211

పర్యాయము —

క. ఏకాధేయం బరయ న, నేకాధారంబులందు నిర వైక్రమముం
జేకొనఁ బర్యాయంబు మ, హాకవిసంస్తుత్య మయ్యె నది యె ట్లన్నన్. 212

సీ. కందర్పహరునందుఁ గనువిప్పఁగా నేర్చి, శరజన్మోద్భవునందు శక్తి యెఱిఁగి
రామునందచలాంబరము గట్టఁగా నేర్చి, జలధిలంఘనునందు జంగ యెఱిఁగి
ఘటజునందు దుర్ధయపక్షములఁ బోర్లఁగ నేర్చి, వెస ద్రౌణియెడఁ బాలు వేఁడ నెఱిఁగి
మొగి వృకోదరునందు ముష్టి పూనఁగ నేర్చి, విజయునియెడఁ గర్ణవేధ యెఱిఁగి

తే. యనుదినంబును నభివృద్ధిఁ దనరు శౌర్య, శిశువు భవదీయదోస్తంభజృంభమాణ
ఖురళిఁ గౌక్షేయచాలనస్ఫురణ మెఱిఁగె, వైరిగజసింహ యోబయనారసింహ. 213

సూక్ష్మము —

క. ఈక్షితిఁ దలపోయ నసం, లక్షితసూక్ష్మార్థకౌశలప్రకటనవై
చక్షణ్యము సూక్ష్మం బగు, నక్షీణకవిప్రశస్త మది యె ట్లన్నన్. 214

ఉ. ప్రాణము నంటినాకు నిజభావము దాఁపఁగ జెల్ల నమ్మ సి
ప్రాణవిభుం బ్రభూతగుణబంధురుఁ దెల్పఁగదమ్మ యంచు వి

స్నానముగా సఖీజనులు నల్గడలం గదియంగ సైకత
శ్రోణి యురంబుమీఁద నఖసూచిక సేర్చె నృసింహభూవరా. 215

ఉదాత్తము.—

క. విశ్వోన్నత మై చెలఁగెడు, నైశ్వర్యము గలుగువస్తు వభినుతి సేయన్
శాశ్వత మగుచు నుదాత్తము, విశ్వంభరలోనఁ బొల్చు విను మెట్లన్నన్. 216

మ. నృపు లర్పించినఁ జేడె లూడ్చి వెలికి న్నేర్పొప్పఁగాఁ గుప్పఁగా
నెపుడుం జల్లినముగ్ధముత్తెములు ధాత్రీశాంగదస్వర్ణచూ
ర్ణపుఁ బ్రోవు ల్దగు నీగృహాంగణములం దారాద్రిధాత్రీనరా
ధిపముల్ స్వవ్యయభీతి నిగ్గొలుచురీతిన్ శ్రీనృసింహాధిపా. 217

పరివృత్తి.—

క. సమ మిచ్చి సమము గొనన, ల్పము నిచ్చి యనల్పము గొన భావింప నన
ల్పము నిచ్చి యల్పముం గొన, నమరుం బరివృత్తి త్రివిధమై యెట్లన్నన్. 218

సమపరివృత్తి.—

క. శ్రుతిహృదయరత్నభూషా, కృతులు కృతు ల్నీకు నొసఁగి కృతులు నృసింహ
క్షితిపవర నీచేఁ గాంతురు, శ్రుతిహృదయాభరణములు విశోభితలీలన్. 219

అధికదానాల్పాదానపరివృత్తి.—

క. నరసింహ నీదువైరులు, కరిసింహాలులూయభల్లగవయాహిపరం
పరకుఁ దమగృహము లొసఁగుచు, వరుస భజింతురు దదీయవనమందిరముల్.

అల్పదానాధికాదానపరివృత్తి.—

క. నరతనువు నీకరాసికి, నరి యొసఁగి నృసింహభూప యనుపమరంభా
పరిరంభగుంభసంభ్రమ, భరితామరతాశుభప్రభావముఁ జెందున్. 221

కారణమాల.—

క. ఇల నుత్తరోత్తరములకుఁ, బొలుపొందఁగఁ బూర్వపూర్వములు హేతువులై
యలరఁగఁ గారణమాలిక, యలంకరణరాజ మయ్యె నది యెట్లన్నన్. 222

మ. హరిపాదాంబుజపూజనాభిరతిచే నైశ్వర్య మైశ్వర్యచా
తురిచే సజ్జనరక్షణంబు సుజనస్తోమావనస్ఫూర్తిచేఁ
జిరపుణ్యంబులు పుణ్యవాసనలచేఁ జెన్నొందు సత్కీర్తియు
న్నరసింహాధిప నీకె పొల్చు బుధసంతానైకచింతామణీ. 223

ఏకావళి.—

క. ధరఁ బూర్వపూర్వమునకు, త్తరోత్తరము క్రమసమగ్రతవిశేషణమై
పరఁగిన నేకావళి యన, నరు దగు సత్కృతులయందు నది యెట్లన్నన్. 224

క. అవనిధవాస్థానంబులు, కవియుతములు కవులు రచితకావ్యులు కావ్య
వ్యవహారము లమితభవ, న్నవనవగుణభూషితములు నరసింహనృపా. 225

మాలాదీపకము.—

క. మహిఁ బూర్వపూర్వమునకుఁ, రహి మీఱఁగ నుత్తరోత్తరము రమ్యగుణా
వహముగ మాలాదీపక, మహీనవిఖ్యాతిఁ జెందు నది యెట్లన్నన్. 226

క. గురుచాపముచే శరతతి, శరతతిచే శత్రుశిరము శత్రుశిరముచే
ధర ధరచే నీబాహువు, పరిలబ్ధం బయ్యె నోబపార్థివునరసా. 227

సారము.—

క. నిరవధిక ముత్తరోత్తర, నిరతోత్కర్షంబు దెలుప నిఖిలకృతులయం
దరు దైతగు సారాలం, కరణము కవివినుత మగుచుఁ గడు నెట్లన్నన్. 228

సీ. స్థావరజంగమాధారము త్రిజగంబు, లలజగంబు లజాండములఁ జెలంగు
నాయజాండము లుండు హరిరోమకూపమం, దాశౌరియును భోగిపై శయించు
నాభోగి జలధికోణావాస మొందు నా, కడలి కుంభజుచులుకంబుఁ జెందు
నాకుంభజుఁడు నింగి కేకఖద్యోతాభుఁ, డానింగికబరి యై యతిశయిల్లు

తే. నీయశోలక్ష్మి కక్షీణనీతిచతుర, చతురుదధిమేఖలావృతక్షితిధురీణ
చటులభుజదండదండితోత్కటమదారి, వీరపరివార యోబభూవిభునృసింహ. 229

క. రసవత్ప్రియము లూర్జ, స్విసమాహితములును నిచట వివరింపఁగ లే
దసమరసప్రకరణమున, రసభావాద్యుపనిబద్ధరసములు గానన్. 230

ఉ. సొమ్ములు సొమ్ములుం గలయుసొంపులు పుట్టెడురీతిఁ గార్యజా
లమ్ములయం దలంకృతు లలంకృతులుం గలయంగ శోభ మై
నిమ్మహిఁ బొల్పుఁ దద్ఘటన మెన్నికతోఁ దిలతండులాప్తిరూ
పమ్మునఁ బాలు నీరనయుభాతిఁ దగు న్ద్వివిధత్వ మొందుచున్. 231

క. తిలతండులరూపమ్మున, నలరు న్సంసృష్టిసంకరాఖ్యము పాల్నీ
రిల నేక మైనకైవడిఁ, దెలుపుం దత్సంకరంబు త్రివిధము కృతులన్. 232

తే. ఎనయ నంగాంగిభావంబు నేకవాచ, కానుబంధంబు సందేహ మనఁగ నెట్లు
పొలుచు సంసృష్టిసంకరంబులకు వరుస, లక్ష్యముల నేర్పరించెద లలితఫణితి. 233

సంసృష్టి.—

క. వారిదబలాకులగిరికుచ, వరచందనరజము లగుభవత్కీర్తిరుచుల్
నిరవద్యసుధాంభోధి, స్ఫురణంబు వహించె నోబభూవరునరసా. 234

క. వారిదబలాచందన మయి, యరు దగునసురూపకంబు నమృతాంభోధి
స్ఫురణంబుఁ దాల్చె ననియెడి, సరసనిదర్శనయుఁ బొల్చు సంసృష్టి యనన్.

అంగాంగిభావసంకరము.—

క. అసిజిహ్వాభయదం బై, యసమమహాబలవిశేషహారియు నై యి
వ్వసుధ భవద్భుజదండము, బొసఁగుఁ ఫణిమాడ్కి నోబభూవరునరసా. 236

క. అసిజిహ్వాక యనురూపక, మసమమహాబలవిశేషహారిశ్లేషం
బెసఁగు ఫణిమాడ్కి భుజము, నెస నంగాంగిత్వ మొందెఁ దెలియ నుపమతోన్.

ఏకవాచకానుప్రవేశసంకరము.—

క. విశ్వామిత్రమదాపహ, శాశ్వతసౌభాగ్య మగుచు సతతోన్నతమై
విశ్వనుతశ్రీనృసింహప, హీశ్వా నీయసి వసిష్ఠునిడను బోల్చెన్. 238

క. నీవాలు వసిష్ఠునివలె, నేవేళఁ జెలంగు నన్ననేకపదవిశే
షావిర్భూతము లగుచున్, శ్రీవెలయన్ శ్లేష ముపమ చెలఁగును నిచటన్. 239

సందేహసంకరము.—

క. పాకారితురగరాకా, కోకారికరానుకారికోమలరుచియై
యేకాలము రంజిల్లును, నీకీర్తిమరాళి యోబనృపునరసింహా. 240

క. ఇలఁ గీర్తి హంసి యనుచో, సలలితగతి హంసివంటిసత్కీర్తియు కా
కిలఁ గీర్తి యనెడుహంసియొ, తెలియ దుపమరూపకంబు తేటఁగ నిచటన్. 241

క. ఈరీతిం గొన్నియలం, కారము లేర్పఱిచినాఁడఁ గడమదడమనే
నేరక వర్జించుటగా, దారయ విస్తారభీతి నాపాదింపన్. 242

శా. ముక్షామండుపపండువాభయదదోర్దాహాత్మ్యశ్రీఘాటీమహా
తుక్షార ప్రతిరుద్ధభూభువనహిందూరాజ్యసంస్థాపనా
ప్రాక్షద్యోతసులోత్థితధ్వజపట ప్రాయప్రసర్పద్యశ
స్సృక్షిర్వీక్ష్యశరద్వకంకణనుస్యాజాలకోలాహలా. 243

క. సాహిత్యభోజ భూజన, సౌహిత్యనిదాన దాన సంతానమహా
బాహాపదానవాహా, రోహణరేవంతలలితరూపజయంతా. 244

వర్గపంచకరహితసుగంధివృత్తము.

హారహీరసారసారిహారశైలవాసవో, ర్వీశహాహిహారశేషవేషహాసలాలస
శ్రీరసోరయాళసాంశుశీలవైరివీరసం, హారసారశౌర్యసూర్యహార్యవార్యసాహసా.

గద్యము. ఇది శ్రీహనుమత్ప్రసాదలబ్ధ కవితాసారసారస్వతాలంకార నిరంకుశ ప్రతిభాబంధుర ప్రబంధపఠనరచనాధురంధర ప్రబంధాంక వేంకటరాయభూషణ సుపుత్త్ర తిమ్మరాజపౌత్త్ర సకలభాషావిశేషనిరుపమావధాన శారదామూర్తి మూర్తి ప్రణీతం బైన నరసభూపాలీయం బనఁ దద్రాజనామధేయాంకితం బై పొల్చుకావ్యాలంకారసంగ్రహం బనుమహాప్రబంధంబునం దర్థాలంకారవిభాగంబును సంకరసంసృష్టినిర్ణయంబు నన్నది సర్వంబును బంచమాశ్వాసము సంపూర్ణము.



'వావిళ్ల' ప్రెస్, తండయార్పేట, చెన్నపురి.—1920.